

కర్నూలు జిల్లాలోని సంజామలజాతీయ విస్తరణ సేవాకేంద్రానికి రాష్ట్ర ముఖ్యమంత్రి
18-10-1957 తేదీన ప్రారంభోత్సవం జరిపారు

కర్నూలు జిల్లాలోని చాపరాలలో ఎ. సి. సి. టీచర్సు ట్రెయినింగు శిబిరం నిర్వహింపబడింది.
16-10-1957 తేదీన కేడెట్లు రోడ్డు వేస్తున్న దృశ్యం



# ఆంధ్రప్రదేశ్

సంపుటి 2

నవంబరు, 1957

కార్తీకము, శాలివాహనశకము - 1879

సంచిక 1

## విషయసూచిక



— చందా —

సాలుసరి రు. 1—8—0

లేక

ఒక రూపాయ 50 న.పై.

విడిప్రతి 0—2—0 లేక

12 నయా పైసాలు

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.



ముఖచిత్రం :

ఆంధ్రప్రదేశ్ అవతరణ ప్రథమ వార్షికోత్సవం సందర్భంలో రాష్ట్రగవర్నరు శ్రీ భీమసేన్ సాచార్ 1957 నవంబరు 1 వ తేదీన హైద్రాబాదులోని గోషామహల్ స్టేడియంలో గౌరవ సైనిక వందనం స్వీకరిస్తున్న దృశ్యం.

వెనుకవైపు కవరు :

19-10-1957 తేదీన షంషాబాదులో గ్రామ నాయకుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. ఆ శిబిరంలో శిక్షణ పొందిన గ్రామనాయకులు.



# "ఆంధ్రప్రదేశ్‌ను భూతలస్వర్గంగా చేయడానికి అంతా కలసికట్టుగా కృషిచేద్దాం"

## రాష్ట్ర ప్రథమ వార్షికోత్సవ సందర్భంలో గవర్నరు ఉద్బోధ

ఆంధ్రప్రదేశ్ అవతరణ ప్రథమవార్షికోత్సవం సందర్భాన రాష్ట్రగవర్నరు శ్రీ భీమసేన్ సాచార్ 1957 నవంబరు 1 వ తేదీన హైద్రాబాదు రేడియోనిలయంనుంచి సందేశమిస్తూ రాష్ట్రం లోని అన్నివర్గాల ప్రజలు తమ తమ సత్సంప్రదాయాలకు బద్ధులైవుంటూ దేశ శ్రేయోభివృద్ధుల నిమిత్తమై పాటుపడవలెనని ఉద్బోధించారు. వారి సందేశం పూర్తిపాఠం :

నేడు నవంబరు 1 వ తేదీ. ఇది చాలా శుభ దినం. సరిగ్గా ఏడాదిక్రితం ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రావతరణ జరిగింది. మన పిల్లల పుట్టినరోజు పండుగ మనం చేసుకుంటూ బంధువులను స్నేహితులను ఆహ్వానించి పండ్లు, మిఠాయిలు పంచిపెట్టి మన పిల్లలు చిరంజీవులు కావాలనీ, సంఘంలో ప్రయోజన కారులైన - ఉత్తమ సభ్యులుగా వర్ధిల్లాలనీ అందరము కలిసి పరాత్పరుణ్ణి ప్రార్థించిన ట్లే, రాష్ట్రావతరణ వార్షికోత్సవాన్ని వేడుకగా జరుపుకోవడానికై ప్రభుత్వం కూడా ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రావతరణోత్సవ దినాన రాష్ట్రమంతటా పబ్లిక్ సెలవుదినంగా ప్రకటించింది. కుల మత భేదాలు లేకుండా రాష్ట్ర ప్రజానీకం యావన్మంది తమకు ప్రేమ పాత్రమైన మాతృ రాష్ట్రపు జన్మదినోత్సవ శుభసమయాన, అత్యంత శ్రద్ధాసక్తులై ద్విగుణీకృతోత్సాహ వంతులై వార్షికోత్సవ సంరంభంలో పాల్గొంటారని ఆశిస్తున్నాను.

కొడుకు పుట్టినరోజు జరుపుకునే సందర్భంలో, తల్లి దండ్రులు తమ పిల్లవాడు ఆరోగ్యవంతంగా దినదిన ప్రవర్థమాన మవుతున్నాడా లేదా అని ఒక సారి పరిశీలించి చూసుకుంటారు. జీర్ణశక్తి, సరియైన నిద్ర ఉంటున్నదా అని పార చూసుకుంటారు. మల బద్ధకం, జలుబు, దగ్గు వగైరా జబ్బు లేమైనా ఉన్నవా అనీ, అంటువ్యాధులు వగైరా ముట్టకుండా టీకాలు వేయించబడినవా అనే విషయాలను కూడా శ్రద్ధగా చూస్తారు. అదేవిధంగా మనం కూడా మన రాష్ట్రానికి సంబంధించినంతవరకు గత సంవత్సరపు జయాపజయాలను సమీక్షించుకొని, మనం సాధించిన అభ్యుదయాన్ని అంచెనా వేసుకుని, భావి సంవత్సర కార్యక్రమ నిర్ణయోన్ముఖులము కావలసి ఉంటుంది.

### మనలను ఎదుర్కొంటున్న ప్రశ్నలు

ఈనాడు మనలను ఎదుర్కొంటున్న ప్రశ్నలు ఇవి :

(అ) ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పేర్కొనబడిన పద్ధతులలో ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం అభివృద్ధి చెందుతున్నదా ?

(ఆ) వ్యవసాయం, నీటి పారుదల, పరిశ్రమలు, ఆరోగ్యము, రహదార్లు మొదలగు రంగాలలో నిర్ణీత లక్ష్యాలను మనం సాధించ గలుగుతున్నామా ?

రాష్ట్రాభ్యుదయసాధనకృషిలో తమపాత్రనుసక్రమంగా నిర్వహించామా - లేదా అని ఒకసారి ఆలోచించుకోవలసిందని రాష్ట్రంలోని వివిధ పార్టీలకు, తరగతులకు చెందిన ప్రజానీకాన్ని, కోరుతున్నాను. ఉధికారులు, వర్తకులు, పారిశ్రామిక వేత్తలు, వ్యవసాయదార్లు, చేతి వృత్తుల పనివారూ, అందరూ యీ విధంగా ఆలోచించుకొని, తమ కృషిలో అడ్డు వస్తున్న ఇబ్బందులను పరిష్కరించుకోగల విధా

నాలను రూపొందించుకోవలసిందిగా, వారికి నా విజ్ఞప్తి.

## ప్రభుత్వోద్యోగులు

మొదట్లో ప్రభుత్వోద్యోగుల విషయం ప్రస్తావిస్తాను. పరిపాలన వ్యవస్థ కొనసాగటానికి వీరే బాధ్యత వహించి పనిచేస్తున్నారు. వారికి యీ సందర్భంలో కొన్ని ప్రశ్నలు వేస్తాను.

1. ప్రభుత్వ ఖజానానుండి మీరు పొందుతున్న నెలసరి వేతనాలకు సరిపడునట్టి విధంగా మీ ధర్మాలను, మీ విధ్యుక్త విధులను, బాధ్యతలను మీరు సక్రమంగా నిర్వహిస్తున్నారా ?

2. లంచాలు వగైరా చట్ట వ్యతిరేకపు పద్ధతుల ద్వారా అధికార్జన చేయవలెననే తలంపును తొలగించుకోగలుగుతున్నారా ?

3. మీరు ప్రజా సేవకులనే భావం మీ హృదయాలలో గాఢంగా నాటుకున్నదా ?

## వాణిజ్యవర్గాలు

వాణిజ్యవర్గాలవారికి కొన్ని ప్రశ్నలు వేస్తాను.

(అ) మీరు మీవృత్తి ధర్మ నిర్వహణ సందర్భంగా, అధికార్జనాపేక్షతో చట్టవ్యతిరేకమైన అన్యాయపు పద్ధతులను అనుసరించారా ?

(ఆ) సక్రమమైన కొలతలు తూనికలువినియోగించి, ఆహార పదార్థాలు, ఔషధాలు వగైరా వస్తువులు కల్తీలేకుండా అమ్మినారా ?

(ఇ) బ్లాక్‌మార్కెటింగ్, వస్తువుల దొంగరవాణా, అక్రమంగా నిలువవుంచుట, మొదలగు సాంఘిక వ్యతిరేక చర్యలను మీరేమైనాచేసినారా ?

(ఈ) పన్నులను ఎగగొట్టి తద్వారా ప్రభుత్వమునకు న్యాయంగా రావలసిన ఆదాయం రాకుండా చేసినారా ?

నదులు, చెరువులు, కుంటలు, వాగులు సముద్రము మొదలగు ప్రదేశములనుండి నీరు ఆవిరిగా మారి మేఘములేర్పడి, మరల వర్షము రూపములో భూమిమైపడుతున్న విధంగా, అనేకప్రత్యక్ష పరోక్ష సుంకములద్వారా ప్రభుత్వము ధనము సేకరించి, వివిధ సంక్షేమ కార్యక్రమాలు, అభివృద్ధి కార్యకలాపాల రూపంలో ఆ ధనమును ప్రజలకు ఇచ్చివేస్తున్నది. ప్రజాస్వామిక వ్యవస్థలో, యీవిధంగావసూలు చేయబడిన ధనమును ప్రభుత్వము దుర్వినియోగము చేయకుండా కనిపెడుతూ ఉండే అవకాశంకూడా ప్రజలకున్నది. అటువంటి దుర్వినియోగ చిహ్నములు కనిపించిన యెడల ప్రజలుఎన్నుకున్న ప్రజా ప్రతినిధులు ఆవిషయమును ప్రభుత్వ దృష్టికితెచ్చి శాసనసభలు, పార్లమెంటు ద్వారా ఆందోళన చేయవచ్చు.

## వ్యవసాయ దార్లు

రైతులకు ఒకమాట. ప్రజలకు కావలసిన పదార్థములనే, అంటే వరి, జొన్న, మొక్కజొన్న, గోధుమ, మొదలగుపంటలను పండిస్తున్నారా ? లేక మీ ఆదాయమును అభివృద్ధిచేసుకొనుటకై పొగాకు, ఇతర వ్యాపారపంటలను పండిస్తున్నారా ? జాతీయ సంపదలను కూర్చుటలో మీరు అతిముఖ్యమైన పాత్ర వహిస్తున్నారని ప్రభుత్వం గుర్తించిందనీ, జాతీయాభ్యుదయ సాధన మీరుచేసేకృషితో పెనవైచుకొని ఉన్నదనే విషయాలనూ మీరు గ్రహించండి. పరిస్థితులను మీకు అనుకూలంగా మలచే ఉద్దేశంతో, భక్రానంగల్, హిరాకుడ్, దామోదరవ్యాలీ, నాగార్జునసాగరువంటి బృహత్ప్రణాళికలను ప్రభుత్వం నిర్వహిస్తున్నది. నీటిపారుదల సౌకర్యాలు, విద్యుచ్ఛక్తి అధికముచేయుటకై ఆంధ్రప్రదేశ్‌లోని గోదావరి, కృష్ణా, తుంగభద్ర, మూసీ, మంజీరా నదుల జలాలను వినియోగించే పథకాలు అమలు పరచపడుతున్నవి. రైతుల ఋణభారమును పరిష్కరించుటకూ, కౌలు, భూమి యాజమాన్యపుహక్కుల సంరక్షణ సాధించుటకూ తగినచట్టములు చేయబడి, తద్వారా, దున్నేవారికే తత్ఫలము పూర్తిగా చెందునట్లు ఏర్పాట్లుచేయబడుతున్నవి. ఇదే సోషలిస్టు తరహా సమాజస్థాపన లక్ష్యములోని ప్రథమ ప్రయోజనము.

## యువజనులు

విద్యార్థులు, వారి తల్లిదండ్రులు యీ ప్రశ్నలు వేసుకుని ఆలోచించండి.

(అ) వివిధభావాలకు రూపకల్పనజరిగే యౌవన దశలో, యువజనుల భవిష్యత్తు ఆశాజనకంగా,

ప్రయోజనకరంగా పరిణమించువిధంగా దేశంలోని యువకుల వ్యవహారాలు సక్రమంగా నిర్వహించబడుతున్నవా ?

(ఆ) మీరు పూర్తికాలమును విజ్ఞానార్జన కృషిలోనే శ్రద్ధగా వినియోగిస్తున్నారా? మన పెద్దలు చెప్తూవుండేవారు - "విద్యార్థికి సుఖం, భోగాలు పనికిరావు. అవేకావాలనుకుంటే, విజ్ఞానాన్ని గురించి, తదార్జన విషయాలను గురించి మరచిపోవచ్చు" అని. భావితరంలో, దేశనాయకులు, డాక్టర్లు, ఇంజనీర్లు, న్యాయాధిపతులు, శాసన కర్తలు, పారిశ్రామిక వేత్తలు, వర్తక వాణిజ్య రంగాలలో యోధులందరూ ఇప్పటి యువజనులనుండియే ఆవిర్భవించగలరనే విషయాన్ని సర్వదా గుర్తుంచుకోండి. ఈ మహత్కార్యాలు సాధించటానికి సన్నద్ధులుకండి. అంతేకాని బాతాఖానీలతో, సినిమాలు, చీట్లపేకాటలతో కాలక్షేపంచేయటంమానండి. శరీరదార్ఢ్యం, మనోబలం, ఆత్మనిగ్రహం, పెంపొందించు కొని, తద్వారా జాతిని వీర్యవంతంచేయండి. అర్థరహితమైన ఆందోళనలు. విద్రోహకరమైన సమ్మెల ఉద్యమాలకు దూరంగాఉండండి. క్రమశిక్షణను అలవరచుకొని గౌరవించండి.

రాష్ట్రంలోని కళాకారులు, చేతివృత్తుల నిపుణులకొక ప్రశ్న: తాజమహల్, కుతుబ్ మీనార్, కోణార్క్, భువనేశ్వర్, పూరీ, దేవాలయాలు, అజంతా, ఎల్లోరా చిత్రసౌందర్యాలు - వీటన్నిటి వెనుక ఏకసూత్రబద్ధమైయున్న మహాలక్ష్యాలను మీరు మననంచేసుకున్నారా ? ఆ మహాధర్మపథాన్ని దర్శించటానికి ఉద్యుక్తులైనారా మీరు? మన దేశంలో పూర్వకాలపు, శిల్పులు, రాతిలో ప్రాణము వుట్టిపడునట్టి సజీవచిత్రములు మలచారు. వారి అడుగు జాడలలో శయసిస్తున్నామాలేదా అని మరొకసారి ఆత్మవిమర్శ చేసుకోవటం అత్యావసరం.

మహర్షులు, మహామునులు, యతీంద్రులు, గురువులు, అవతారపురుషులు, మహాసేనానులు, పండితులు, శాస్త్రవేత్తలు మొదలగు అనేకమందినీ, మన నాగరికతకూ, సంస్కృతికీ రూపురేఖలుదిద్దిన వేలాది మహాపురుషులను కన్న భారత మహిళామణులకు, మాతృమూర్తులకూ ఒక ప్రశ్న : నిత్యనూతనమైన స్వాతంత్ర్య భారత నిర్మాణ కార్యక్రమంలో ఇదివరకులాగానే ఇప్పుడుకూడా శ్రద్ధాళువులై మీరు పనిచేస్తున్నారా ?

శ్రీరామచంద్రుడు, కృష్ణుడు, భీముడు, అర్జునుడు, రుస్తుం, ఇస్ఫందియార్, జీసస్, మహమ్మద్, నానక్, శివాజీ, ప్రతాప్, జగదీశచంద్రబోస్ వంటి మహాపురుషులనూ, సీత, సావిత్రి, లీలావతి, అహల్యాబాయి వంటి నారీరత్నములనుగన్న వీరమాతలని గౌరవంగా పిలుపించుకొనే మహద్భాగ్యముకొరకు నేటి మహిళామణులు ఉవ్విళ్లూరుతున్నారా ?

ఆంధ్రప్రదేశ్‌లో వివిధప్రదేశాలలోని ఫ్యాక్టరీలు, కర్మాగారాలలో పనిచేస్తున్న శ్రమజీవులకొకమాట: మీరుమీహక్కులకొరకు, ఆందోళనచేసే సందర్భంలో, మీరుచేసేచర్యలు దేశప్రయోజనాలకు అవరోధములుగా పరిణమించి, జాతీయ ఉత్పత్తిని కుంటుపరచునవిగా ఉండకూడదనే విషయం గుర్తుపెట్టుకోండి. రాష్ట్ర ఆర్థికాభ్యుదయము, శ్రమజీవుల మంచిచెడులతో అతిసన్నిహితంగా పెనవేసుకుని వున్నది.

పరస్పర సహనము, విశ్వాసము, మర్యాద, ప్రేమ మొదలగు సలక్షణాలతో పౌరులందరూ మెలగాలని వారికి వినయపూర్వకంగా విజ్ఞప్తి చేస్తున్నాను. "జీవించండి, ఇతరులను జీవించనీయండి" అనే ఆదర్శమునూ, "ఒరులేయవి యొనరించిన" అనే పద్యములోని నీతినీ ఆచరణలో పెట్టుకుంటూ, జీవితయాత్ర సాగించాలని పౌరమహాజనులకు విజ్ఞప్తి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమును స్వర్గధామంగా చేసుకోటానికి నడుంకట్టి కృషిచేద్దాం. అప్పుడే మనం పొందిన స్వాతంత్ర్యానికి మనము నిజమైన వారసులమవుతాము.

రాష్ట్ర ప్రజానీకమును సత్పథములో నడుపవలసిందనీ, ముక్కోటి ఆంధ్రులను వారి చిరకాల అభ్యుదయలక్ష్యమువైపు సక్రమంగా పురోగమింపచేయవలసిందనీ దయామయుడైన పరాత్పరుణ్ణి ప్రార్థిస్తున్నాను.

జైహింద్





# ఐక్యతతో ప్రవర్తిస్తే ఆంధ్రప్రదేశ్ ఆదర్శరాష్ట్రం కాగలదు

## ముఖ్యమంత్రి సందేశం

జలవిద్యుత్తు ఖనిజసంపత్తిగల సువిశాల రాష్ట్రము. ముక్కోటి ఆంధ్రులు యేకమైన రాష్ట్రము యేర్పడి యీనాటికి సంవత్సరమైంది. క్షణంలో యేడాది గడచి నట్లుంది. ఈ రోజు ఆంధ్రప్రజలకెల్ల పర్వదినము.

రాష్ట్రావతరణ తీరని శంకలతో, సందేహాలతో ప్రారంభమైంది. తెలంగాణా ఆంధ్రులు మొగలాయి పరిపాలన వల్లను, ఉత్తర దేశ సంపర్కమువల్లను అతి సున్నితమైన మర్యాదలకు అలవాటుపడి యున్నారు. మొట్టమొదట వారితో యెట్లా ప్రవర్తించ వలసింది తెలియక చాలా జాగ్రత్తగా ఉండవలసి వచ్చేది. కాని మనుష్య వాంఛలు, సమస్యలు అంతటా ఒకటిగానే ఉంటాయి. తెలంగాణావారి భావాల కను గుణంగానే వర్తించి, ప్రాంతీయాభివృద్ధికి వారికి కావలసినంత స్వేచ్ఛ నొసంగి, వారికి ఒక విధమైన ధైర్యం కలిగించినాము. మరింత పురోభివృద్ధికి ఆశ కలిగించినాము. రాష్ట్ర విలీనీకరణ సమయంలోనున్న అనుమానాలు ఇప్పటికి తీరి చక్కని వాతావరణం యేర్పడింది. ఈ పరిస్థితి యేర్పడడానికి సుహృద్భావంతో యెంతో తోడ్పడిన తెలంగాణా ప్రజలు యెంతయు కొనియాడదగినవారు. వారి సమస్యలను తీర్చడానికిని, వివిధ శాఖలలో పనిజేయు అనుభవాన్ని, అర్హతను గమనించి వారికి తగిన ఉన్నతస్థానాలిచ్చియు, వారికిచ్చిన వాగ్దానాలను చెల్లించుటకు చేసిన ప్రయత్నాలను సరిగా అర్థం చేసుకోగలిగినారు. ఇప్పటికి పూర్తిగా నమ్మకం కలిగింది. కార్యభారమంతా యిక ముందున్నది. మనసులు కలసి దీక్షబూని సమస్యలను విపులంగా సునిశితంగా విమర్శించి మన రాష్ట్రాన్ని, తదుపరి దేశాన్ని ముందుకు నడిపించుటకు నడుముకట్టవలసిఉంది. ఆర్థిక సమస్య లున్నప్పటికి అందరు చేయి పట్టువలతో పనులను సాధించుకోగలమనే నమ్మకముంది. భూపరిష్కారము, పరిశ్రమలను జాతీయంచేయుట, నీటిపారుదల పథకాలు, విద్యుచ్ఛక్తి సరఫరా స్కీములు ఇంకా ఇతర రెండవ పంచవర్ష ప్రణాళికలోని కార్యక్రమాలు రాష్ట్రాన్ని ముందుకు తీసుకపోగలవి ఉన్నవి. ఐక్యతతో ప్రవర్తిస్తే ఆంధ్రప్రదేశం అన్నివిధాల ఆదర్శరాష్ట్రంగా ఉండగలదని ఆశిస్తున్నాను.

జైహింద్.

నీలం సంజీవరెడ్డి
ముఖ్యమంత్రి.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి మొట్టమొదటి పారిశ్రామిక కేంద్రం

ఆంధ్రప్రదేశ్‌కు మొట్టమొదటి పారిశ్రామిక కేంద్రం త్వరలో ఏర్పడబోతున్నది. దీనినే ఇండస్ట్రియల్ ఎస్టేట్ అంటారు. ఇటువంటి ఎస్టేట్లు ఇంగ్లండుదేశంలో వున్నవి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రపు తొలి పారిశ్రామికకేంద్రం రాజధానీ నగరమైన హైదరాబాదులో సనత్‌నగర్ అనే పేటలో నిర్మింపబడుతున్నది. దీని నిర్మాణానికి రూ 30 లక్షలు ఖర్చు అవుతాయని అంచెనా.

ఇటువంటి పారిశ్రామిక కేంద్రస్థాపనకు సనత్‌నగర్ ఎంతైనా తగివున్నది. ఈ కేంద్రం 50 ఎకరాల మేరకు విస్తరించి వుంటుంది. ఇందులో 30 స్వల్పపరిశ్రమలు నెలకొల్పబడతాయి. అన్నిపరిశ్రమలకు కలిపి ఒక ఆసుపత్రి, ఒక కార్మిక సంక్షేమకేంద్రం, శిశుపోషణశాల మొదలైన సదుపాయాలు వుంటాయి. ఈ కేంద్ర నిర్మాణానికి నిర్ణయించబడిన స్థలం ముడి సామగ్రి సరఫరాకూ, కార్మికులు లభించడానికీ, విద్యుచ్ఛక్తి సరఫరాకు వీలైనతావులో వుండడమేగాక సరుకులను వినియోగించే స్థలాలకుకూడా అందుబాటులో వున్నది.



సనత్‌నగర్‌లో నెలకొల్పబడుతున్న పారిశ్రామిక ఎస్టేటువద్దకాచ్చి గ్రామస్థులు శ్రద్ధగా చూస్తున్నారు.



*సనత్ నగర్ పారిశ్రామిక ఎస్టేట్ ప్లాను*

రాష్ట్రీ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి ఈ పారిశ్రామిక కేంద్రానికి 1957 అక్టోబరు 16 వ తేదీన శంకుస్థాపనచేస్తూ దేశ ఆర్థిక పురోగతిలో స్వల్ప పరిశ్రమల ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పారు. భూమిపై రైతుల వత్తిడిని తగ్గించాలన్నా, ఎక్కువ మంది మనుషులకు పనులు చూపాలన్నా స్వల్ప పరిశ్రమల్లో అవకాశాలు ఎక్కువగా వుంటాయి. భారతదేశ జనాభాలో నూటికి 8 వంతుల మంది ప్రత్యక్షంగానో పరోక్షంగానో భూమిపై ఆధారపడి వున్నారు. కనుక మన జనాభాలో కొంత శాతాన్ని ఇతర వృత్తులకు, పనులకు మళ్ళించడం అవసరం. అందుకు సమయం కూడా ఆసన్నమైంది. దేశంలోని లక్షలాది ప్రజలకు స్వల్ప పరిశ్రమల్లోనే పనులు దొరుకుతవి. భారీ పరిశ్రమల్లో చాలా తక్కువ మందికి ఉద్యోగాలుంటాయి. అదీగాక, భారీ పరిశ్రమలను పెట్టడానికి బోలెడు డబ్బు, భారీ యంత్ర సామగ్రి కావాలి. కనుకనే దేశంలోని వివిధ ప్రాంతాలలో పారిశ్రామిక కేంద్రాలను ఏర్పాటు చేయడం ద్వారా స్వల్ప పరిశ్రమల అభివృద్ధిని సాధించవలెననే తలంపుతో భారత ప్రభుత్వం తగు కార్యక్రమం నిర్ణయించిందని ముఖ్య మంత్రి చెప్పారు.

చేనేత పరిశ్రమకు కొన్ని రకాల బట్టను కేటాయించినట్లే స్వల్ప పరిశ్రమలకు కూడా కొన్ని రకాల సరుకుల తయారీని కేటాయించవలెనని ముఖ్య

మంత్రి సూచించారు. స్వల్ప పరిశ్రమల్లో అనేక మందికి పనులు దొరికే అవకాశమున్నది గనుకనూ, భూమిపై వత్తిడిని తగ్గించడానికి ఈ పరిశ్రమలు తోడ్పడతాయి గనుకనూ, దేశీయమైన ఈ పరిశ్రమలకు తగు ప్రోత్సాహ మివ్వడానికై కొన్ని రకాల సరుకుల దిగుమతిని కట్టుబాటు చేయడం కూడా అవసరం అని ముఖ్య మంత్రి అన్నారు.

## హెచ్చు తగ్గులు లేని సమవ్యవస్థ

దేశంలో లభించే మానవ సంపదను ఉపయోగించే దృష్ట్యా, పారిశ్రామికోత్పత్తుల వినిమయం దృష్ట్యా, దేశ అవసరాలను తీర్చడానికై భారీ పరిశ్రమలు, స్వల్ప పరిశ్రమలు అటు మరీ హెచ్చుగా కాక, ఇటు మరీ తక్కువగాక ఒక క్రమపద్ధతి ప్రకారం సమంగా వ్యవస్థీకరించ బడవలెనని ముఖ్య మంత్రి అన్నారు. అలా కాక ఒకదానికి హెచ్చు ప్రాముఖ్య మిచ్చి, మరొకదాన్ని ఎగుడు దిగుళ్ళుగా వుంచుతూపోతే అది దేశ ఆర్థిక వ్యవస్థకు మంచిదికాదని హెచ్చరించారు.

స్వల్ప పరిశ్రమలను ఎదుర్కొంటున్న సమస్యలలో సరుకుల విక్రయం ప్రధానమైన సమస్య అని ముఖ్య మంత్రి తెలిపారు. అందుచేత పారిశ్రామిక కేంద్రంలో తయారయ్యే సరుకుల విక్రయానికై కేంద్రం వారు తగు అవకాశాలను పరిశీలించి మార్కెట్లను వెదుకుతారని వారన్నారు.

ఈ సందర్భంలో వాణిజ్యపరిశ్రమలశాఖ డైరెక్టరు శ్రీ కె. ఐ. విద్యాసాగరు ప్రసంగిస్తూ రెండవపంచవర్ష ప్రణాళిక కాలంలో దేశమంతటా ఇండస్ట్రియల్ ఎస్టేట్లు నెలకొల్పడానికై యూనియన్ ప్రభుత్వం రూ. 10 కోట్లు కేటాయించిందని తెలియజేశారు. రాష్ట్రప్రభుత్వం ఈ సంవత్సరం రూ. 70 లక్షల ఖర్చుతో ఐదుఎస్టేట్లను నెలకొల్పవలెనని తలపెట్టిందనీ, ఇప్పుడు మొదటి ఎస్టేటు హైదరాబాదులో నెలకొల్ప




సనత్ నగర్ పారిశ్రామిక ఎస్టేటుకు వెళ్ళే మార్గాన్నిచూపే పటము.

బడుతున్నదనీ, ఇంకా మరొరెండు ఎస్టేట్ల స్థాపన ప్రభుత్వపరిశీలనలో వుందనీ తెలియపరిచారు.

ఇలాంటి పారిశ్రామిక ఎస్టేట్లవల్ల చిన్నపరిశ్రమల వారికి ప్రమాణ బద్ధంగా నిర్మించిన చక్కని ఫ్యాక్టరీలు లభిస్తాయనీ, వాటిలో ఫ్యాక్టరీ నియమావళి ప్రకారం గాలి, నీరు, వెలుతురు,తదితర ఆరోగ్య సదుపాయాలు వుంటాయనీ శ్రీ విద్యాసాగరు అన్నారు అంతేగాక ప్రతి ఎస్టేటుకు రోడ్డు సౌకర్యాలు, టెలిగ్రాఫ్ టెలిఫోన్, బ్యాంకు, ఆసుపత్రి, అల్పాహారాల సౌకర్యాలుకూడా అమర్చబడివుంటాయని అన్నారు. వారింకా ఇలా అన్నారు.

దేశ ఆర్థికాభివృద్ధి కార్యక్రమంలో చిన్నపరిశ్రమలు అతిముఖ్యమైన పాత్రవహించాలి. చిన్న పరిశ్రమలకు ఎక్కువగా యంత్రసామగ్రి అక్కరలేదు. అవసరంగా కావలసినవాటిని దేశంలోనే తయారుచేయవచ్చు. కనుక ఈ పరిశ్రమలను వృద్ధిచేయాలి. అప్పుడు విదేశాలనుంచి భారీయంత్ర సామగ్రిని దిగుమతి చేసుకోవలసిన అవసరంవుండదు.

పారిశ్రామికంగా బాగా అభివృద్ధిచెందిన అమెరికా వంటి దేశాలలోకూడా స్వల్ప పరిశ్రమలద్వారా ఎంతోఉత్పత్తి జరుగుతున్నది. కనుక ఇటువంటి ఎస్టేటుస్థాపనవల్ల చిన్న చిన్న పరిశ్రమల వారిసమస్యలు కొంతవరకు పరిష్కారమై కొన్నికొన్ని ప్రాంతాలలో జనసమ్మర్దం ఎక్కువకావడం తప్పుతుంది. వీటివల్ల కొత్తగా పరిశ్రమలను స్థాపించ దలచుకున్న వారికి ఉపయోగంవుంది. అట్టివారికి వాణిజ్యపరిశ్రమలశాఖ సౌకర్యం విద్యుచ్ఛక్తి, నీరు సరఫరా చేస్తుంది.

విజయవాడ, విశాఖపట్నం, సామర్లకోట, నంద్యాలల్లోకూడా పారిశ్రామిక ఎస్టేట్లు స్థాపించబడగలవు.

సనత్ నగరు ఎస్టేటుకు రూ. 30 లక్షలు అవుతాయి. ఈ ఖర్చులో భూముల సేకరణ, వాటిని అభివృద్ధిపరచడం, రోడ్లువేయడం, పనివాళ్ళకు 30 వర్కుషెడ్లను నిర్మించడం, ఆసుపత్రి మొదలగు సౌకర్యాలఖర్చులుకూడా చేరివున్నవి.

భారతదేశంలో చిన్నపారిశ్రామికులను ఎదుర్కొంటున్న ముఖ్యమైన ఇబ్బంది వర్కుషాపులకు తగిన ఫ్యాక్టరీస్థలం లేకపోవడం. ఈ ఇబ్బందివల్లనే అనేకులు కొత్తపరిశ్రమలను పెట్టడానికి ముందుకు రావడంలేదు. ఈ ఇబ్బందికి కారణాలు అందరికీ తెలిసినవే. మొదట భూమికొనాలి; ఫ్యాక్టరీల నియమావళిప్రకారం, ఆరోగ్యనిబంధనల ప్రకారం కొత్త భవనాలుకట్టాలి. వీటికి ఎంతోఖర్చుఅవుతుంది. చిన్న పారిశ్రామికులు ఈ ఖర్చులు భరించలేరు పైగా ఫ్యాక్టరీ మంచి అనువైనప్రదేశంలో వుండాలి. సరుకు ఉత్పత్తికి విక్రయానికీ ఎట్టిఇబ్బందులు వుండకూడదు. అంటే ముడిసామగ్రి, పనిమనుషులు, విద్యుచ్ఛక్తి, నీరు బాగాలభించేచోట్ల ఫ్యాక్టరీవుండాలి. వినిమయ కేంద్రాలకు కూడా అది దగ్గరగావుండాలి. నీరు, విద్యుచ్ఛక్తి అన్నిప్రదేశాలలో సమృద్ధిగా లభించవు. ఈ ఇబ్బందులనన్నిటినీ బాగా అవగాహనచేసుకున్న మీదటనే భారత ప్రభుత్వం వివిధ రాష్ట్రాలలో పారిశ్రామిక ఎస్టేట్లను నెలకొల్పవలెనన్న నిర్ణయం చేసింది. ఇంతవరకూ పట్టణాలలో ఎక్కడబడితే అక్కడ, సరియైన క్రమమూ పథకమూలేకుండా పరిశ్రమలను నెలకొల్పడం జరుగుతూ వచ్చింది. ఇప్పుడు ఇలాకాక అన్ని సౌకర్యాలున్న అనువైన చోట్లనే పారిశ్రామిక కేంద్రాలు ఏర్పడతాయి.

ఒక క్రమమున్నూ, ఒక పద్ధతి ప్రకారం నివాస గృహాములను కట్టి ఇండ్లు లేనివాళ్ళకు లభింపచేసినట్లే ఫ్యాక్టరీ భవనాలను కట్టి వాటిని రెడీమేడ్‌గా చిన్న పారిశ్రామికులకు లభింపచేయవచ్చు. స్వంత ఫ్యాక్టరీలు కట్టుకోవడానికి డబ్బులేని పారిశ్రామికులెందరో వున్నారు. అయితే అన్ని సౌకర్యాలతో ఎవరైనా గనుక కట్టి ఇచ్చినట్లయితే వారు సమంజసమైన అద్దె మాత్రం చెల్లించి పరిశ్రమలు పెట్టుకుంటారు. ఇటువంటి ఎస్టేట్లు ఇంగ్లండులో వున్నవి. వాటిని ట్రేడ్ ఎస్టేట్లు అంటారు. తగు ప్రదేశాలలో పారిశ్రామిక ఎస్టేట్లు నెలకొల్పడంద్వారా చిన్న పరిశ్రమలను క్రమబద్ధంగా అభివృద్ధి చేసే అవకాశాన్ని పరిశీలించవలసిందని భారత ప్రభుత్వ స్వల్ప పరిశ్రమల బోర్డువారు రాష్ట్ర ప్రభుత్వాలకు సూచించారు. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వ సహాయంతో ఈ విధంగా స్వల్ప పారిశ్రామికులకు సౌకర్యం కలుగజేస్తూ వున్నది. ఈ ఎస్టేట్ల వల్ల మురికిపేటలంటూ ఏర్పడవు. పరిశ్రమలు పెట్ట దలచుకున్న వారికి అనుకూలమైన స్థలం లభిస్తుంది.

(తరువాయి 12 వ పేజీలో)

# ఆంధ్రప్రదేశ్ ప్రథమ సంవత్సర ప్రగతి



ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణం జరిగి సరిగా ఒక సంవత్సరం అయింది. ఈ యేడాదికాలంలో అనేక ముఖ్య సంఘటనలు జరిగినవి. రాష్ట్రంలో రాజకీయ సుస్థిరత్వం సాధించబడింది. పరిపాలనా విధానాలలో ఐక్యత చేకూరింది. అంతేకాక సమ్మెలు వగైరా కొన్ని స్థానిక సమస్యలు పరిష్కరించటానికై సమర్థవంతమైన సత్వర చర్యలు గైకొనబడినవి. తద్వారా ప్రజలలో ప్రభుత్వంపట్ల విశ్వాసం బాగా పెరిగింది. కొన్ని బృహత్సమస్యలపట్ల కూడా మెలకువతో ప్రవర్తించి, సామరస్యపూర్వకమైఖరి ప్రదర్శించటం ద్వారా, అభ్యుదయ పురోగమన పథంలో గల అనేక అవరోధాలు తొలగిపోయాయి. ఆంధ్ర మద్రాసు సరిహద్దు సమస్యల సమరస పరిష్కారం, తుంగభద్ర ఎగువకాల్వ నిర్మాణం విషయమై మైసూరు రాష్ట్రంతో సాధించిన ఒడంబడిక, ఆంధ్రప్రదేశ్‌కు ఎగువ సభ నిర్మాణ నిర్ణయం, ఆంధ్రప్రాంతంలోని భూ కమతాల సంఖ్యావివరాల సరియైన సేకరణకు తీసుకున్న మొట్టమొదటి అతి ముఖ్యమైన చర్య, రవాణా సౌకర్యాల జాతీయకరణ విధానమును క్రమేణా యితర ప్రదేశాలకు విస్తరించే సంకల్పము, జిల్లా బోర్డుల స్థానే జాతీయ విస్తరణ సేవాకార్యక్రమాల బ్లాకుల స్థాయిలో అభివృద్ధి సంఘాల నిర్మాణ ప్రతిపాదన మొదలైన వివిధ నిర్ణయాలను, రాష్ట్రాభివృద్ధి పథంలో అత్యంత ప్రయోజనకారి, సత్ఫలితదాయి అయిన ప్రభుత్వ విధానమునకు రూపకల్పనచేయుటలో ప్రముఖమైన సంఘటనలుగా అభివర్ణించవచ్చు.

కాని మనరాష్ట్రపు ఆర్థిక పరిస్థితి అంత సంతృప్తికరంగా లేదనే విషయం తెలిసినదే. యీ సంవత్సరపు బడ్జెట్ అంచనాలలో రు. 5.48 కోట్ల రూపాయల వరకు లోటు చూపించబడింది. అయినప్పటికీ, అభివృద్ధి కార్యక్రమాలు, జాతీయ నిర్మాణ కార్యక్రమాలు అప్రతిహతంగా ముందుకు సాగిపోతూనే వున్నవి. ఈ సంవత్సరం రాష్ట్రప్రభుత్వం బహిరంగమార్కెట్‌లో ఋణం సేకరించలేదు. కాని చిన్న మొత్తాల పొదుపు ఉద్యమాన్ని ఉద్ధృతంగా కొనసాగించి, తద్వారా రు. 9.25 కోట్ల రూపాయలు సేకరించటానికి విశేషంగా ప్రయత్నాలు జరుగుతున్నవి.

1957-58 సంవత్సరంలో, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోని వివిధ కార్యక్రమాలకు దిగువ పేర్కొనబడిన విధంగా కేటాయింపులు జరిగినవి;

| | |
|---|---|
| వ్యవసాయ కార్యక్రమాలు | రూ. 6.99 కోట్లు |
| నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | రూ. 15.77 ,, |
| పరిశ్రమలు | రూ. 2.51 ,, |
| రవాణా సౌకర్యాలు | రూ. 1.19 ,, |
| సాంఘిక సంక్షేమం, జాతీయ నిర్మాణ కార్యక్రమాలు | రూ. 6.48 ,, |
| ఇతర కార్యక్రమాలు | రూ. 1.05 ,, |

దశాంశనాణెములవంటి అఖిలభారత నూత్న విధానములను అమలు పరచుటలో పూర్తిగా సహకరిస్తూ, రాష్ట్ర ప్రజలు త్వరితగతిలో తమ పూర్వపు అలవాట్లనూ, నూతన విధానాలకు అనుగుణంగా మలుచుకుంటూ సరిపెట్టుకుంటున్నారు. వచ్చే ఏప్రిల్ నెల నుండి అమలులోనికి రాబోతున్న మెట్రిక్ తూకములు, కొలతల విధానమును గురించి ప్రజలలో ముందుగా తగు ప్రచారము చేయుటకై అప్పుడే ప్రయత్నాలు ప్రారంభమైనవి.

రాష్ట్రంలో అమలు పరచబడుతున్న కమ్యూనిటీ అభివృద్ధి కార్యక్రమం కూడా త్వరితగతిలో నిరాటంకంగా సాగిపోతున్నది. గత ఏప్రిల్ నెల 1వ తేదీ నాటికి జాతీయ విస్తరణ సేవా కార్యక్రమాల బ్లాకులు, కమ్యూనిటీ అభివృద్ధి బ్లాకులు, అనంతర తీవ్రకృషి బ్లాకులు, బహుళార్థసాధక ప్రాజెక్టులు ఏవైతేనేమి, అన్ని రకాలుకలిసి రాష్ట్రంలో మొత్తం 150 బ్లాకులు పనిచేస్తున్నవి. ఇంకా ఈ సంవత్సరం 123 జాతీయ విస్తరణ బ్లాకులు, 40 కమ్యూనిటీ అభివృద్ధి బ్లాకులు, 18 అనంతర తీవ్రకృషి బ్లాకులు, కొత్తగా ఏర్పాటు చేయబడుతున్నవి. రాష్ట్రం మొత్తంమీద 433 జాతీయ విస్తరణ సేవాకేంద్రాలను నెలకొల్పుకొనటం మన అంతిమలక్ష్యం. ఈ బ్లాకులన్నిటిలోనూ, అధికోత్పత్తి, విద్య, సాంఘిక సంక్షేమం, శ్రమదానం వగైరా వివిధ

రంగాలలో బహుముఖమైన అభివృద్ధి కార్యక్రమాలు కొనసాగుతున్నవి. క్రమంగా అధికార్లకు మారుగా స్థానిక ప్రజలే చొరవతో ముందుకు వచ్చి యీ కార్యక్రమాలు చేపట్టి నిర్వహిస్తూ వుండటం ముదావహం. అధికార్ల పాత్ర క్రమంగా సలహాలిచ్చి సహాయం చేయడం మాత్రమే అవుతుంది.

673 లక్షల యకరాల వైశాల్యంగల మన రాష్ట్రములో, సుమారు 41 శాతం భూమిపై వ్యవసాయం జరుగుతున్నది. ఇంకా అధికభాగం, ఆహార పదార్థముల ఉత్పత్తిమీదనే శక్తిఅంతా కేంద్రీకరించి పని జరుగుతూవుండటం చేత, పెద్దవీ, మధ్యతరహా, చిన్న రకపు ప్రాజెక్టులలో పని జరుగుతున్నకొలది, యింకా ఎక్కువ భూమికి సాగునీటి సౌకర్యాలు లభించటానికి అవకాశం కలుగుతున్నది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో పూర్తిఅయిన నాలుగు మధ్యతరహా ప్రాజెక్టులను మినహాయిస్తే, ఆంధ్రప్రాంతంలోని మిగిలిన పెద్ద, మధ్యరకపు ప్రాజెక్టులన్నీ కూడా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద యింకా కొనసాగింపబడుతున్నవి. వీటిలో తుంగభద్ర ప్రాజెక్టు, కృష్ణారెగ్యులేటర్ పథకం, ఎగువ పెన్నారు పథకము, రొంపేరు మురుగు పథకం, రాళ్లపాడు ప్రాజెక్టు రెండవ దశ, భైరవానితిప్ప ప్రాజెక్టు మొదలగునవి చేరివున్నవి. వీటి అన్నింటివల్ల కృష్ణా, గుంటూరు, నెల్లూరు, అనంతపురం జిల్లాలలో 2,90,675 యకరాలకు సేద్యపు నీటిపారుదల సౌకర్యాలు కల్పించబడగలవు. ద్వితీయ ప్రణాళికలో చేర్చబడిన మరొక క్రొత్త పెద్ద ప్రాజెక్టు వంశధార; ద్వితీయ ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో రెండు ప్రాంతాలకూ ఉపకరించగల నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్వహణనిమిత్తం రు. 19.95 కోట్లు కేటాయించబడినవి. నాగార్జున సాగర్ ఆనకట్టలో రాతికట్ట భాగానికి 1957 జులై 12 వ తేదీన కేంద్ర ప్రభుత్వ నీటిపారుదల విద్యుచ్ఛక్తి శాఖామాత్యులు శ్రీ యస్. కె. పాటిల్ గారు ప్రారంభోత్సవం చేశారు. ప్రస్తుతం యీ నిర్మాణపు పని చాలా చురుకుగా జరుగుతున్నది. కాఫర్ డామ్ నిర్మాణం పూర్తి అయింది. కృష్ణపై వంతెన, మాచెర్ల నుండి 11 మైళ్ళ రైలుమార్గము నిర్మాణములు పూర్తి కావచ్చినవి. ఆయా ప్రదేశాలను కలుపుతూ రోడ్లు వేయబడినవి. విద్యుచ్ఛక్తి స్తంభాలువగైరా సన్నాహక సామగ్రి స్థాపన పూర్తి అయినవి. మాచ్ ఖండ్ నుంచి వచ్చే విద్యుచ్ఛక్తి వాడబడుచున్నది. నదిలో మూడింట రెండు వంతుల భాగములో పునాదుల త్రవ్వకం పని పూర్తి అయింది. విజయపురిలో నివాస వసతి సౌకర్యాల కల్పన కార్యక్రమాలు కూడా బాగా సాగిపోతున్నవి. అప్పుడే 755 గృహాల నిర్మాణం పూర్తి అయింది. యింకా 455 గృహాలు నిర్మాణదశలో వున్నవి. కుడికాలువ పొడవునా పరిశీలనలు పూర్తి అయినవి. వాలమైళ్ళవరకు కాలువ మార్గ నిర్దేశము తుది స్వరూపము ధరించింది. కాలువత్రవ్వకం పనులు కొనసాగుతున్నవి. ఎడమవైపు కాలువ విషయంలో కూడా యీ విధంగానే గణనీయమైన అభివృద్ధి సాధించబడింది. 1957 జూన్ చివరివరకు ఈ ప్రాజెక్టుమీద రు. 6.16 కోట్ల రూపాయలు ఖర్చుజరిగింది.

తెలంగాణా ప్రాంతములో రాజోలీబండ మళ్లింపు పథకం, కడం ప్రాజెక్టు పని మిగిలిన ప్రాజెక్టులుగా పరిగణింపబడి ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో కూడా కొనసాగింపబడుతున్నవి. వీటి నిర్మాణముకొరకు రు. 270.05 లక్షలు కేటాయించబడినవి. మహబూబ్ నగర్ జిల్లాలో కోయిల్‌సాగర్, సరళాసాగర్ ప్రాజెక్టులు, నల్లగొండజిల్లాలో మూసీ, భీమనపల్లి ప్రాజెక్టులు, మధ్యతరగతి నీటిపారుదల పథకాలుగా ద్వితీయ ప్రణాళికలో కొనసాగింపబడగలందులకై, వీటికొరకు రు. 64.80 లక్షల మొత్తము కేటాయింపుజరిగింది. మూసీ ప్రాజెక్టుక్రింద, ఆనకట్ట కట్టకుండానే, యింకా రిజర్వాయరు నిర్మాణం జరుగనిదే, అప్పుడే కుడి కాల్వద్వారా 2000 ఎకరాలకు సేద్యపు నీటిపారుదల సౌకర్యం కల్పించబడటం చెప్పుకోదగిన సంఘటన. వచ్చే జూన్ నెలాఖరుకు 10000 ఎకరాలకు నీటి సప్లయిజరగాలని ఉద్దేశించబడింది. ఈ ప్రాజెక్టు 1959 లో పూర్తి అవుతుంది. మొదటి అంచనాల ప్రకారం, యీ ప్రాజెక్టుక్రింద అభివృద్ధి చేయదలచిన మొత్తం ఆయకట్టు 38,000 యకరాలు. కాని దీనిని యింకా 20 శాతం పెంచాలని కృషిజరుగుతున్నది.

కొన్ని కొన్ని జిల్లాలు కేవలం చెరువులమీద, కుంటలమీదనే ఆధారపడివుండటం కద్దు. అందువల్ల మైనర్ ఇరిగేషన్ పథకాలకు కూడా అత్యంత ప్రాధాన్యము ఇవ్వబడుతున్నది. నిరంతరం శ్రద్ధతీసుకుంటూ యీ చెరువులు, కుంటలను మరమ్మతుచేసి, తక్షణ్రింత

ప్రజలకు ఉపయోగకారులగునట్లు చేయడం జరుగుతున్నది.

ఆంధ్రలో తలసరి సగటు విద్యుచ్ఛక్తి వినియోగం ప్రథమ ప్రణాళిక కాలంలో 2.5 నుండి 8 యూనిట్లకు పెరిగింది. ద్వితీయ ప్రణాళిక చివరకు దీనిని 20 యూనిట్లకు పెంచటానికి కృషిజరుగుతున్నది. ఆంధ్ర ప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తి ఉత్పత్తిశక్తి 2,22,875 కిలోవాట్లకు పెంచబడుతుంది. క్రొత్తగా 417 పట్టణాలకు, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయిచేయబడుతుంది. మిగిలిన పథకాలుగా పరిగణింపబడి, మాచ్‌ఖండ్, తుంగభద్ర జలవిద్యుత్పథకాలు ద్వితీయ ప్రణాళిక కాలంలో కూడా కొనసాగింపబడుతున్నవి. పారిశ్రామిక సంస్థలకూ, గ్రామాలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయటానికి ఉద్దేశించిన కార్యక్రమాలు త్వరితంగా అమలుపరచబడుతున్నవి. రామగుండం థర్మల్‌పవర్ స్టేషన్ నుండి విద్యుచ్ఛక్తి సప్లయి ప్రారంభమైంది. నిజాంసాగర్ జలవిద్యుత్పథకం విషయంలో నిర్మాణ కార్యక్రమం జోరుగా సాగుతున్నది. హైదరాబాదులోని ఆవిరితో నడిచే థర్మల్‌స్టేషన్ విస్తరణ పథకం కూడా అమలు పరచబడుతుంది. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి పథకాలమీద చూపుతున్నంత శ్రద్ధ పరిశ్రమలపై చూపకపోయినా వాటిని చిన్నచూపు చూడటం కూడా లేదు. అశ్రద్ధ చూపబడుతూవుండటం అంతకంటే లేదు. పెద్ద పరిశ్రమలు, మధ్యతరహా పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు, కుటీర పరిశ్రమలకూ, కేంద్రరాష్ట్రప్రభుత్వాలనుండి అవసరమైన ప్రోత్సాహం, సహాయం లభిస్తూనే వున్నది. రాజమండ్రిలోని ఆంధ్ర పేపరు మిల్లు, గూడూరులోని ప్రభుత్వ పింగాణి ఫ్యాక్టరీల విస్తరణ కార్యక్రమం, తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర పేపరు, అట్టల మిల్లు స్థాపన, తెలంగాణాలో ఒక మిల్లుతోసహా రాష్ట్రంలో పంచదార సహకార ఫ్యాక్టరీల స్థాపన మొదలగు బృహత్కార్యక్రమాలు రాష్ట్ర పారిశ్రామికాభ్యుదయ ప్రణాళికలో తలపెట్టబడిన ముఖ్యాంశములుగా పేర్కొనవచ్చు.

అటవీ రక్షణ, అటవీ ప్రాంత విస్తరణ కార్యక్రమాలు విద్యుక్తధర్మాలుగా నిర్వహింప బడుతున్నవి. దీనితోపాటు రాష్ట్రంలోని వన్యజీవజాల సంపదను కూడా సంరక్షించుకునే కృషి తీవ్రంగా జరుగుతున్నది. క్రొత్తగా మరికొన్ని అభయారణ్య ప్రాంతములను ఏర్పాటు చేయుట, తుపాకులతో క్రూరమృగములను వేటాడుటకు బదులుగా "ఫోటోల వేటను" ప్రోత్సహించుట మొదలగు వివిధ చర్యలద్వారా యీ సంరక్షణ కార్యక్రమాన్ని కొనసాగించటానికి ఏర్పాట్లు జరుగుతున్నవి. ఏటేటా అక్టోబరు నెలలో వన్యమృగ సంరక్షణ వారోత్సవాలు జరుగుతున్నవి. వీటివల్ల ప్రజానీకమునకూ, వేటగాండ్రకూ, వన్యమృగ సంరక్షణ కార్యక్రమంలో తాము వహించవలసిన ధర్మబద్ధమైన పాత్ర ఏమిటో సుస్పష్టంగా తెలియజేయబడుటకు అవకాశం లభిస్తున్నది. ఈ సంవత్సరం జరిగిన వన్యమృగ సంరక్షణ వారోత్సవాల సందర్భంగా వన్యమృగాల చిత్రాలతో కూడిన ఒక కరపత్రం కూడా ప్రచురించబడింది.

ప్రస్తుతం పాఖాల, ఏటూరునాగారం, పోచారంలో గల మూడింటికి తోడుగా రాష్ట్రంలో యింకా మూడు అభయారణ్య ప్రాంతాలను ఏర్పాటు చేయాలని సంకల్పం. ఆదిలాబాద్ జిల్లాలో కువాల్ అభయారణ్యము, చిత్తూరు, కడప జిల్లాలలో శ్రీ వేంకటేశ్వర అభయారణ్యము, గుంటూరు నల్లగొండ జిల్లాలలో నాగార్జునసాగర్ అభయారణ్యము యీ మూడింటినీ ఏర్పాటు చేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

పోతే జాతీయ నిర్మాణ కార్యక్రమాల రంగంలో కర్నూలులో వైద్య కళాశాల స్థాపన ఒక ముఖ్య సంఘటన. దీనికి 1957 జూలై 21వ తేదీన కేంద్ర ప్రభుత్వ ఆర్థిక శాఖామాత్యులు ప్రారంభోత్సవం చేశారు. దీనివల్ల రాయలసీమకు యితోధికమైన ఆరోగ్య సౌకర్యాలు చేకూరటానికి సదవకాశం లభించింది. మామూలుగా రాష్ట్రమంతటా జరుగుతున్న వ్యాధినిరోధక ప్రక్రియ కార్యక్రమాలు, ఆరోగ్య వసతుల అభివృద్ధి కార్యక్రమాలకు తోడుగా, ఎక్కువ గ్రామీణ ప్రాంతాలలో ఆసుపత్రుల నిర్మాణం, మందుల సరఫరా వగైరా కార్యక్రమాలను తీవ్రంగా కొనసాగించాలనే ప్రభుత్వ విధానము ననుసరించి, యీ పనులు చురుకుగా జరుగుతున్నవి. యింకా విద్య, సాంకేతిక శిక్షణ, సాంఘిక సంక్షేమం, గిరిజన సంక్షేమం, పారిశ్రామిక గృహవసతి సౌకర్యాలు, స్వల్పాదాయ వర్గాల గృహవసతి నిర్మాణం, రవాణా సౌకర్యాలు వగైరా వివిధ రంగాలలో కూడా యిటు

వంటి పురోగమనశీలమైన అభివృద్ధి సాధించబడుతూ వున్నది.

భారత ప్రభుత్వం తలపెట్టిన "సాంఘిక నైతిక ఆరోగ్య సంరక్షణ కార్యక్రమాల" క్రింద రూ 5,46,400 ల ఖర్చుతో రాజమండ్రి, గుంటూరు, కర్నూలు, హైదరాబాదు, సికింద్రాబాదులలో 5 రాష్ట్ర గృహాలను, జిల్లాకొకటి చొప్పున మొత్తం 20 జిల్లా శరణాలయాలను స్థాపించుటకు ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది. ఇందులో సగం ఖర్చును భారత ప్రభుత్వం భరిస్తుంది. సంస్కరణ గృహాలనుంచి స్త్రీ. పురుషులను విడుదల చేసిన తరువాత వారి విషయంలో ఈ రాష్ట్ర గృహాలు తగు శ్రద్ధ వహిస్తాయి. అలాంటి వ్యక్తులకు తగువృత్తులు కల్పించే నిమిత్తమై ఉత్పత్తి శిక్షణ కేంద్రాలను నెలకొల్పవలెనని కూడా తలపెట్టబడింది. ప్రతి రాష్ట్ర గృహంలో 16, 21 సంవత్సరముల మధ్య వయస్సులో వున్న యువకులకు ప్రత్యేక విభాగం వుంటుంది. ప్రతి రాష్ట్ర గృహంలో నూరు మందిని వుంచుతారు.

రాష్ట్ర గృహాలకు మార్పిడి చేసే ముందుగా జిల్లా శరణాలయాలలో కొందరు వ్యక్తులను వుంచడమవుతుంది. ప్రతి శరణాలయంలో స్త్రీ, పురుషులు వేర్వేరు విభాగాలలో వుంచబడుతారు. వీరు సాధారణంగా మూడునెలలకు మించి ఈ శరణాలయాలలో వుండరు. కొన్ని సందర్భాలలో కొద్ది రోజులు మాత్రమే వుంటారు. ప్రతి జిల్లా శరణాలయంలో 25 మందిని వుంచుతారు.

అయితే మన రాష్ట్రంలోని మూడుకోట్ల ప్రజానీకం అవసరాలు లెక్కకు మిక్కిలిగా వున్నవి. అవి క్రమేణా పెరుగుతూ వుంటాయి కూడా. ప్రజలు, ప్రజల అభిమాన నాయకులు కలిసి కట్టుగా కృషిచేసి, ఉమ్మడిగా పరిశ్రమిస్తేనే, ప్రజావసరాలు సాధ్యమైనంత త్వరగా తీరి, రాష్ట్రప్రజల నిజమైన అభ్యుదయ సాధన జరుగుతుంది. ప్రజాభ్యుదయ సాధన కృషిలో ప్రభుత్వంతో సహకరించి పనిచేయటానికి రాష్ట్రప్రజలు సర్వసన్నద్ధంగా వున్నారనే విషయం, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన యీ సంవత్సర కాలంలో స్పష్టంగా వ్యక్తమైనది. ప్రజలకూ, ప్రభుత్వానికీ మధ్య ఏర్పడిన యీ స్నేహసుహృద్భావ వాతావరణం బాగా అభివృద్ధి చెందినకొలది, ప్రజలలోని అన్ని వర్గాలవారికీ సౌఖ్యప్రదమైన జీవిత పరిస్థితుల సత్వర సాధన సుగమమవుతుంది.



---

## ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి మొట్టమొదటి పారిశ్రామిక కేంద్రం

(8 వ పేజీ తరువాయి)

పారిశ్రామిక ఎస్టేటుకుండే మరో సౌకర్యం రైల్వే సైడింగు. ఒకవేళ అది లేకపోతే ఫ్యాక్టరీ నుంచి రైలు స్టేషనుకు చక్కని రోడ్డు వుంటుంది. పోతే పనిమనుషులు, నీరు, విద్యుచ్ఛక్తి బాగా లభిస్తయి. ఈ విధంగా ఈ ఎస్టేట్లవల్ల చిన్న పారిశ్రామికులు పరిశ్రమలను స్థాపించడానికి ముందు పెద్దగా ఖర్చు పెట్టవలసిన అగత్యం వుండదు.

సనత్‌నగరు పారిశ్రామిక ఎస్టేటు మంచి అనుకూలమైన తావులో వుంది. పూర్వపు హైద్రాబాదు ప్రభుత్వం ఇదివరకే సనత్‌నగరు అను పేరుతో పారిశ్రామిక పట్టణాన్ని నెలకొల్పింది. అందులో ఆల్విన్ మెటల్‌వర్క్సు, అస్బెస్టాస్ సిమెంట్సు, లామినేటెడ్ ప్రాడక్ట్సు మొదలగు పరిశ్రమలున్నవి. ఇప్పుడు నెలకొల్పబడే ఇండస్ట్రియల్ ఎస్టేటు ఈ పరిశ్రమలకు ప్రక్కనే వుంటుంది. ఇక్కడ రవాణా, విద్యుచ్ఛక్తి సౌకర్యాలు బాగా వున్నవి. ఉప పరిశ్రమలు కూడా నెలకొనే అవకాశమున్నది. మరొక విశేష మేమిటంటే ఎస్టేటు స్థలం బొంబాయి వెళ్ళే పెద్ద రోడ్డు ప్రక్కనే వున్నది. ఈ ప్రాంతంలో ఇప్పటికే ఒక పారిశ్రామిక పట్టణం ఏర్పడి ఉత్పత్తి పని జరుగుతూవుంది.

* * * *

# శ్రమదానము

ప్రజలు సహకార కృషితో గ్రామంలో సమానత్వ, సౌభాగ్యములను కల్పించడమే శ్రమదానం లక్ష్యం.

భారతప్రభుత్వ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ శాఖామంత్రి శ్రీ యస్. కె. డే. సూచనపై బ్లాకుప్రాంతాలలో వారం రోజులపాటు రాష్ట్రవ్యాప్తంగా శ్రమదానోద్యమాన్ని నిర్వహించడానికి అంగీకరింప బడింది.

శ్రమదాన సప్తాహంలో ఈ క్రింద తెలియపరచిన విధంగా ప్రతిగ్రామంలో పనులు జరుగునట్లుగా చూడవలసిందని జిల్లాకలెక్టర్లకు ఉత్తర్వు లివ్వబడినవి :

1. రోడ్డు పనులు
2. బీడుభూములను సాగుకు తేవడం
3. చెరువులు
4. భవనాలు
5. మురుగు కాల్వలు
6. పారిశుధ్య కార్యక్రమాలు
7. ఆటస్థలాలు, పార్కులు వగైరా.

1957 ఏప్రిల్ నెలలో శ్రమదానం పని జరుపబడింది. మళ్ళీ 1957 మే 26 తేదీనుంచి జూన్ 1వ తేదీవరకు కూడా శ్రమదాన సప్తాహం జరిగింది.

వివిధ బ్లాకులలో జరిగిన పనుల వివరాలను కలెక్టర్లు తెలియజేశారు. ఆ భోగట్టానుబట్టి చూస్తే శ్రమదానోద్యమం సంతృప్తికరంగా జరిగిందని విదితమవుతున్నది. కొన్ని బ్లాకులలో జరిగిన పనులు ఇవి :

### 1. మంగళగిరి జాతీయ విస్తరణ సేవాకేంద్రం

ఇది గుంటూరు జిల్లాలో వున్నది. హరిజనుల ఇండ్ల వరకు రోడ్లు వేయబడినవి. బావులు మరమ్మతు చేయబడ్డవి. పాఠశాలల మైదానములు చదును చేయబడ్డవి. హరిజన వాడలలో మురుగుకాల్వలు వేయబడ్డవి. కచ్చా రోడ్లు వేయబడినవి. ఈ విధంగా రూ. 7,500-ల పని జరిగింది.

### హయాత్ నగర్

హయాత్ నగర్ జాతీయ విస్తరణ సేవా కేంద్రం హైదరాబాదు జిల్లాలోవుంది. చిన్న వంతెన ఒకటి, అప్రోచ్ రోడ్లు, మరికొన్ని రహదార్లు వేయబడినవి. మురుగునీటి గుంటలు ఏర్పాటు చేయబడినవి. ఈ పనిలో గ్రామస్తులు ఉత్సాహంగా పాల్గొన్నారు. సహపంక్తి భోజనం ఏర్పాటు చేయబడింది. అందులో వివిధ కులాలవారు 300 మంది పాల్గొన్నారు.

### కపిలేశ్వర పురం

ఇది అనంతర తీవ్రకృషి బ్లాకు. ఇది తూర్పు గోదావరి జిల్లాలోవుంది. హరిజన పాఠశాల భవనం, బండ్ల స్టాండు, గ్రామ మందిరం నిర్మింపబడ్డవి. మంచినీటి చెరువుకు మరమ్మతులు చేయబడ్డవి. మట్టిరోడ్లు వేయబడినవి. పారిశుధ్య కార్యక్రమం అమలు జరిగింది. గ్రామాధికారుల, గ్రామ పంచాయితీబోర్డుల అధ్యక్షుల సమావేశాలు జరిగినవి.

### మహబూబాబాదు

మహబూబాబాదు జాతీయ విస్తరణ సేవాకేంద్రం వరంగలు జిల్లాలోవుంది. బలపాల, కొరివి, రాజోలు గ్రామాలలో శ్రమదానోద్యమం నిర్వహింప బడింది. అనేక పారిశుధ్య కార్యక్రమాలు అమలు జరిగినవి. వేదికలు, కచ్చారోడ్లు, మురుగుగుంటలు, కంపోస్టు గుంటలు నిర్మింపబడినవి. గ్రామవీధులను చదరంజేసి శుభ్ర పరచడమైనది. ప్రజలు ఈ పనులన్నిటిలో ఉత్సాహంగా పాల్గొన్నారు.

### కొల్లాపురం

కొల్లాపురం జాతీయ విస్తరణ సేవాకేంద్రం మహబూబునగరు జిల్లాలోవుంది. శ్రమదానోద్యమం సందర్భంగా 875 ఎరువు గుంటలు, 441 కంపోస్టుగుంటలు, 390 మురుగునీటి గుంటలు, త్రవ్వబడినవి. 10 ఫర్లాంగుల

పక్కా రోడ్లు 3½ మైళ్ళ కచ్చారోడ్లు వేయబడినవి. 3½ మైళ్ల పొడవున గ్రామకాలువలు ఏర్పాటు చేయబడ్డవి. ప్రజలు ఈ పనులలో ఉత్సాహంగా పాల్గొన్నారు.

సామాజికాభివృద్ధి కార్యక్రమంలో మేలాలకు తగు ప్రాముఖ్య మివ్వబడింది. రాష్ట్రంలోని జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలో, సామాజికవృద్ధి బ్లాకులలో సంఘ అభ్యున్నతికై సాంఘిక విద్యా కార్యక్రమంలో ఒక భాగంగా మేలాలు నిర్వహింప బడుతున్నవి. గ్రామ స్థితి గతులను అభివృద్ధి పరచడంలో ఈ మేలాలు ప్రయోజన కారి అవుతున్నవి. అంతేగాక సామాజికాభివద్ధి కార్య క్రమపు తత్వాన్నీ, పరమార్థాన్నీ మారుమూలలవున్న ప్రజానీకానికిసైతం గొనిపోవడానికి ఇవి మిక్కిలి సమర్థ వంతమైన ప్రచార సాధనాలుగా కూడా ఉపకరిస్తున్నవి.

## కలిదిండి

కృష్ణాజిల్లాలోని జాతీయ విస్తరణసేవా కేంద్రాలలో కలి దిండికేంద్రం ఒకటి. ఈకేంద్రానికి సంబంధించినదే పోతుమ ర్రుగ్రామం. అగ్రామవాసులు 1957 ఆగస్టు 11,12 తేదీలలో కలిదిండిలో నిర్వహింపబడిన గ్రామనాయకుల శిక్షణ శిబి రంలో శిక్షణ పొందినమీదట శ్రమదానంతో పోతుమర్రు నుంచి వెంకటాపురానికి 2½ మైళ్ళ పొడవున మట్టి రోడ్డు వేయ సంకల్పించారు. తదనుసారం ఉత్సాహవంతులయిన గ్రామస్థులను నూరుమందిని కూడగట్టుకొని స్వాతంత్ర్య దినోత్సవంనాడు పని ప్రారంభించారు. వీరి కృషికి బ్లాకు ఉద్యోగులు మంచి చేయూతనిచ్చారు. వారు కూడా శ్రమ దానం చేశారు. పని ప్రారంభించిన రోజునే 200 గజాల పొడవురోడ్డు పూర్తి అయింది. సెప్టెంబరు 3 వ తేదీవర కల్లా 1½ మైళ్ళ పొడవున రోడ్డుపని జరిగింది.

ఇంతవరకు జరిగిన పనిని వెంకటాపురం గ్రామస్తులు చూచారు. తమవంతు పనిని పూర్తిచెయ్యాలని వారికీ ఉత్సా హం కలిగింది. పోటీపడి వారుకూడా 4 ఫర్లాంగుల పొడ వున రోడ్డు వేసి రెండు గ్రామాలకూ చక్కని బాట ఏర్ప రచు కున్నారు. 4-9-1957 తేదీన దాదాపు 400 మంది గ్రామస్తులు రోడ్డుపనిలో పాల్గొన్నారు. ఈ కార్యం విజయ వంత కావడానికై ఇతరులు అనేక విధాల సహాయ పడ్డారు. రోడ్డుపని చేస్తున్నవారికి కొందరు అల్పాహారాలు సప్లయి చేశారు. గ్రామ బ్యాండు వాయిద్యంవారు తమ వాయిద్యగోష్టితో శ్రమించి పనిచేస్తున్నవారికి వినోదం కల్పించారు. నాలుగువందలమంది గ్రామస్తులూ ఆ రోజున ఉదయం 7 గంటలనుంచి మధ్యాహ్నం 12 గంటలవరకూ పనిచేసి అరమైలు పొడవు రోడ్డును పూర్తిచేశారు. ఈ విధంగా రూ. 5,400 ల విలువచేసే పనిని 19 రోజులలో పూర్తిచేయడం జరిగింది. అంతవరకూ ఇలాంటి రోడ్డు ఒకటి వుంటే బాగుండునని గ్రామస్తులు అనుకొంటూ వుండే వారు. ఇప్పుడది ఏర్పడిపోయింది.

## పొదలకూరు బ్లాకు "మేలా"

నెల్లూరుజిల్లా పొదలకూరులో "మేలా" జరుపడానికై ఒక అనధికార సంఘం ఏర్పాటు చేయబడింది. ఇందులో పలుకుబడిగల ప్రముఖ రైతులు, పంచాయితీ బోర్డుల అధ్యక్షులు, సభ్యులు, బ్లాకులలోని వివిధ గ్రామాల గ్రామ సేవా సంఘాల అధ్యక్షులు, సభ్యులూ వున్నారు. "మేలా"ను విజయవంతంగా జరుపడానికై తగు ఏర్పాట్లు చేయడానికి 12 మంది సభ్యులతో ఒక ఉపసంఘం కూడా వేయ బడింది. ఈ ఉపసంఘం ఆటలు, వైజ్ఞానిక కార్యక్రమాలు పశుప్రదర్శనం, పారిశ్రామిక ప్రదర్శనం, వ్యవసాయ ప్రదర్శనం మున్నగువాటికి ప్రత్యేకంగా మరికొన్ని ఉప సంఘాలను వేసింది. అంతేగాక మేలా ఆహ్వానసంఘం కూడా ఒకటి ఏర్పాటు చేయబడింది. ఈ సంఘాల సభ్యులు అనేకమార్లు సమావేశమై సమస్త విషయాలు చర్చించి బ్లాకు ఉద్యోగుల సహాయంతో రూ. 1,227 ల విరాళాలు వసూలుచేసి, మేలా ఉత్సవాలలో పాల్గొన్నారు.

మేలా ఉత్సవాలను 25-7-1957 తేదీ ఉదయం నెల్లూరు జిల్లా ఇన్‌చార్జి ప్లానింగ్ ఆఫీసర్ ప్రారంభించారు. పొదల కూరు (రామనగర్) హైయర్ ఎలిమెంటరీ స్కూలు విశాలమైన ఆవరణంలో ఉత్సవాలు జరిగాయి. చక్కని అలంకరణతో 32 స్టాల్సు (కొట్లు) ఏర్పాటు చేయబడ్డవి. వినోదాలకు ప్రత్యేకంగా ఒక వేదిక అమర్చబడింది. వీటన్నిటికీ విద్యుద్దీపాలు పెట్టబడ్డవి. ఈకొట్లలో ఎక్కువ భాగం ప్రభుత్వ శాఖలవి. ప్రైవేటు ప్రదర్శనలు కూడా కొన్ని ఏర్పాటయ్యాయి. వర్షం కురుస్తున్నప్పటికీ బ్లాకులోని వివిధ గ్రామాలనుంచి పశువులు ప్రదర్శనం కొరకు తేబడ్డవి.

నాలుగురోజులపాటు చెడుగుడు, పిల్లలకు, యువకులకు త్రాడులాగు పోటీలు మొదలగు పల్లె ఆటలు ఏర్పాటు చేయబడ్డవి. గెలిచినవారికి, కొద్దిలో గెలుపు పోయినవారికి కూడా బహుమతులు ఇవ్వబడినవి. ఈ ఆటలలో 13 యువ

జన సంఘాలకు చెందిన వయోజనులు. 15 పాఠశాలలకు చెందిన విద్యార్థులు ఉపాధ్యాయులు పాల్గొన్నారు.

వైజ్ఞానిక కార్యక్రమాలలో బుర్రకథలు, భజనలు నృత్యాలు, సంగీత కచేరీలు, నాటకాలు ఏర్పాటు చేయబడ్డవి. నిర్ణీత ఉపసంఘాలు వ్యవసాయ ప్రదర్శనంలోను, పశు ప్రదర్శనంలోను వచ్చిన ఉత్తమమైన వాటికి బహుమతులను నిర్ణయించగా ఆ బహుమతులు పంపిణీ చేయబడ్డవి. నెల్లూరువాసి డాక్టర్ అరుంధతి సహాయ సహకారాలతో శిశు ప్రదర్శనం కూడా ఏర్పాటు చేయబడింది. ఆరోగ్యంగా, బలంగావున్న శిశువులకు బహుమతు లివ్వబడ్డవి. మొత్తంమీద ఈ "మేలా" ఉత్సవాలలో దాదాపు మూడువేలమంది ప్రజలు పాల్గొన్నారు. 26-7-1957 తేదీ రాత్రి జిల్లాకలెక్టరు అధ్యక్షతన జరిగిన బహిరంగ సభలో బహుమతి ప్రదానం జరగడంతో ఈ "మేలా" ఉత్సవాలు సమాప్తమయ్యాయి. ఉత్సవాలకు మొత్తం రూ. 1420.66 లు ఖర్చు అయ్యాయి.

## సుంకేశ్వరిగ్రామంలో గ్రామనాయకుల శిక్షణ శిబిరం

నందవరం జాతీయ విస్తరణ సేవాకేంద్రంలో గల సుంకేశ్వరి గ్రామంలో 1957 ఆగస్టు 20 తేదీన గ్రామ నాయకుల శిక్షణ శిబిరం ఏర్పాటు చేయబడింది.

ఈ శిబిరంలో స్పెషల్ కలెక్టరు పర్సనల్ అసిస్టెంటు ప్రసంగిస్తూ గ్రామనాయకులు అభివృద్ధి పనులను చేపట్టాలని ప్రబోధించారు. ఆదోనిలోని జిల్లా పశుసంరక్షణ శాఖాధికారి, హైవేస్ అసిస్టెంట్ ఇంజనీరు, సహకార సంఘాల సబ్ రిజిస్ట్రారు, యెమ్మిగనూరు హెల్తు ఇనస్పెక్టర్, బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసర్, సహకార, నిర్మాణ, వ్యవసాయములకు సంబంధించిన ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లు, స్త్రీ పురుషులకు సంబంధించిన సాంఘిక విద్యావ్యవహర్తలు తమకు సంబంధించిన విషయాలను గూర్చి ప్రసంగించారు.

జాతీయ పతాకం, శ్రమదాన వ్యవస్థీకరణ, సామాజికాభివృద్ధి కార్యక్రమం, మేలురకం కక్కసుదొడ్ల ప్రదర్శనం, వివరణ, పొగరానిపొయ్యి, వ్యవసాయ పనిముట్లు, ఆధునిక వ్యవసాయపద్ధతులు మొదలగు విషయాలనుగూర్చి చేయబడిన ప్రసంగాలను గ్రామస్థులెంతో శ్రద్ధగావిన్నారు.

చివరిరోజున అంటే 5 వ తేదీన జరిగిన బహుమతి ప్రదానోత్సవ సభకు శాసనసభ్యులు శ్రీ టి. జి. తిమ్మయ్య సెట్టి అధ్యక్షత వహించారు. హాలహర్వి గ్రామ అభివృద్ధి సంఘం అధ్యక్షుడు, గ్రామ నాయకత్వంలో శిక్షణ పొందిన వ్యక్తిఅగు శ్రీ కె. ఆర్. హనుమంతరెడ్డి బహుమతులు పంచిపెట్టాడు. తుంగభద్ర ప్రాజెక్టు స్పెషల్ డిస్ట్రిక్టు ఎగ్రికల్చరల్ ఆఫీసరు (ఆదోని) గారు ఆయకట్టు అభివృద్ధి, ఆధునిక వ్యవసాయ పద్ధతులనుగూర్చి ప్రసంగించారు.

గ్రామనాయకుల శిక్షణశిబిరం నిర్వహింపబడిన తరువాత దేవాలయాన్ని మరమ్మతు చేయడానికీ ఆలయావరణలో భజనలు జరుపడానికై భజనమండలిని స్థాపించడానికీ గ్రామస్థులు మాటఇచ్చారు. శ్రమదానంతో వీథిరోడ్లను వేయడానికికూడా ముందుకొచ్చారు.

శిబిరం నిర్వహింపబడిన కాలంలో మంచినీటి బావి నుంచి పెద్దరోడ్డు వరకు కచ్చారోడ్డు వేయబడింది. శ్రమదానం ద్వారా గ్రామంలోకి వెళ్ళడానికి మెట్లనుకూడా కట్టారు.

## కొత్తబొమ్మాళి జాతీయ విస్తరణ సేవాకేంద్రం

ఆంధ్రప్రదేశ్ రెవిన్యూబోర్డు సభ్యులు శ్రీ కె. యస్. అనంతరామన్ 14-10-1957 తేదీన శ్రీకాకుళంజిల్లా కొత్తబొమ్మాళి జాతీయ విస్తరణ సేవా కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపారు. ప్రారంభోత్సవానికి శాసనసభ్యులు శ్రీ ఆర్. యల్. యన్. దొర అధ్యక్షత వహించారు. శ్రీ బి. కూర్మన్న జాతీయ పతాకం ఎగురవేశారు. శాసనసభ్యులు శ్రీ పి. యస్. నారాయణ, శ్రీ యస్. జగన్నాథం గారలు, స్థానిక నాయకులు శ్రీ హెచ్. యస్. దొర, శ్రీ బి. కూర్మన్న, శ్రీ టి. శివరావు ("మహోదయ" సంపాదకులు) ప్రసంగించారు. జిల్లా ప్లానింగ్ ఆఫీసరు జాతీయ విస్తరణ సేవా కార్యక్రమం లక్ష్యాలను, ఆశయాలను వివరించారు. ఒక ప్రదర్శనం కూడా ఏర్పాటు చేయబడింది. అందులో ఇతర అంశాలతోపాటు ఆధునిక వ్యవసాయ పద్ధతులు, పశుపోషణకూడా చూపెట్టబడ్డవి. ప్రదర్శనాన్ని శ్రీ యస్. జగన్నాథం యం. ఎల్. ఏ. ప్రారంభించారు. సామాజిక కృషి ఉపక్రమించ బడింది. సభ ముగిసిన తరువాత సినిమా ప్రదర్శనం జరిగింది.

## షేర్ మహమ్మద్‌పురం బ్లాకు బొడ్డేపల్లిలో శ్రమదానం

బొడ్డేపల్లిగ్రామం షేర్ మహమ్మద్‌పురం జాతీయ విస్తరణ సేవాకేంద్రంలో వున్నది. ఇది తీవ్రకృషికై ఎంచబడిన ఆదర్శగ్రామం. 17-10-57 తేదీన ఈ గ్రామంలో

శ్రమదానం, పారిశుధ్య కార్యక్రమం జరిగాయి. అందులో జిల్లా అధికార్లు బ్లాకు ఉద్యోగులు, స్థానిక శాసన సభ్యులు శ్రీ కె. పున్నయ్య, శ్రీ సి. హెచ్. సత్యనారాయణ, శ్రీ బి.వి. సీతారాం మొదలగు స్థానిక నాయకులు బ్లాకు ప్లానింగ్, డెవలప్‌మెంట్ కమిటీల సభ్యులు, గ్రామస్థులూ పాల్గొన్నారు. వీధిరోడ్డు ఒకటి వేయబడింది. నీటి మురుగు గుంటలు త్రవ్వబడ్డవి, మూత్రశాల ఏర్పాటు చేయబడింది, పశువుల కొట్టాలను శుభ్రపరచడం. వాటికి పైకప్పు వేయడం జరిగింది. ఎరువు దిబ్బలు బాగుచేయబడ్డవి. వ్యవసాయం, పశుపోషణకు సంబంధించిన ఆధునిక పద్ధతులు గ్రామస్థులకు వివరించి చెప్పడమైనది. గ్రామస్థులు ఎంతో ఉత్సాహంతో ఒక ఉపసంఘంగా ఏర్పడి, ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వీధి 12 అడుగుల వెడల్పున వుండేటట్టు చేయడానికై ఎంతోకాలంనుంచి వుంటూవచ్చిన వాటిని స్వయంగా తొలగించారు. సామాజిక కేంద్రం, పిల్లలపార్కు, గ్రామసేవకులకు ఇండ్లు మున్నగు వాటిని నిర్మించడానికై శ్రీయుతులు బి. సత్యనారాయణ, సి. హెచ్. కృష్ణమూర్తి, సి. హెచ్. సత్యనారాయణ తదితరులు 4½ ఎకరాల భూమి విరాళంగా ఇచ్చారు. వైజ్ఞానిక కార్యక్రమం కూడా ఏర్పాటు చేయబడింది.

## శ్రీకాకుళం జిల్లాలో పచ్చిఆకు ఎరువు వాడకం ప్రచారం

శ్రీకాకుళం జిల్లాలోని అన్ని అభివృద్ధి బ్లాకులలో పచ్చిఆకు ఎరువు వాడకాన్ని వ్యాప్తిలోకి తెచ్చేందుకై 16-10-1957 తేదీనుంచి ప్రత్యేకంగా పక్షం రోజులపాటు ఒక కార్యక్రమం అమలు జరుపబడింది. ఈ కార్యక్రమాన్ని ఆముదాలవలస బ్లాకులోని కృష్ణాపురం, సరిబుజ్జాలి గ్రామాలలో జిల్లాకలెక్టరు ప్రారంభించారు. పాఠశాలల పిల్లలు ఊరేగింపుగా వెళ్ళారు. ఈ ఉద్యమం సందర్భంలో సెస్బానియా (సోమింత) విత్తనాలు వేయబడ్డవి. అవి రైతులకు పంపిణీ చేయబడ్డవి. గోడమీద అంటించే కరపత్రాలు, ఊరేగింపులు మున్నగు ప్రచారసాధనాల ద్వారా, పచ్చిఆకు ఎరువుక్షేత్రాలు నెలకొల్పడంద్వారా ఈ పక్షం రోజులూ బాగా ప్రచారం జరుపబడింది.

## ఏజన్సీ గ్రామంలో సంఘసంక్షేమ కార్యక్రమం

కరగంటి గ్రామం సీతంపేట ఏజన్సీలోనిది. 16-10-1957 తేదీన జిల్లాకలెక్టరు కొందరు ఉద్యోగులను వెంటబెట్టుకొని ఈ గ్రామానికివెళ్ళి ఆ పరిసర గ్రామాలలో నివసించే సవర, జాతపు మొదలగు కొండజాతులవారిని కలుసుకున్నారు. కొండజాతులవారి కందరికీ పాలు పంపిణీ చేయబడ్డవి. స్త్రీలకు పిల్లలకు సబ్బులు, మిఠాయిలు పంచిపెట్టబడ్డవి. జిల్లాకలెక్టరు కొండజాతులవారి ఇబ్బందులను విచారించి తెలుసుకున్నారు. భూమిశిస్తు చెల్లింపు, విద్యాసౌకర్యాలు ఇవి వారి సమస్యలు. వీటి పరిష్కారం నిమిత్తమై కలెక్టరు తగు సహాయం ఏర్పాటు చేశారు.

*  *  *



# ఆంధ్రప్రదేశ్ రెండవ పంచవర్ష ప్రణాళిక

ఏ జాతి చరిత్రలోనైనా పంచవర్ష ప్రణాళిక ఆది, అంతము చాలా ముఖ్యమైన సందర్భాలని విజ్ఞులంటారు. ప్లానింగు కమీషన్‌వారు అన్నట్లు ప్రతి పంచవర్షప్రణాళిక గతంలో జరిగిన పనులను సమీక్షించడమేగాక ముందు జరుగవలసిన పనుల విషయంలో దేశీయులకు కర్తవ్యాన్ని నిర్దేశిస్తుంది. ఒక్కొక్క ప్రణాళిక దేశప్రజానీకం యొక్క ఆశలను, ఆశయాలను ఆచరణలో పెట్టడమేగాక పేదరికం నిర్మూలన, ప్రజల జీవనవ్యయ ప్రమాణం హెచ్చింపు మొదలగు సర్వజన శ్రేయస్కరమైన కార్యాలలో ప్రతి ఒక్కరం సేవచేసే అవకాశాన్ని కలిగిస్తుంది.

మొదటి పంచవర్ష ప్రణాళిక 1956 మార్చి నెలలో అంతమైంది. ఆ తరువాతనుంచి రెండవ ప్రణాళిక ఆరంభమైంది. భవిష్యత్తులో శీఘ్రగతిని ఆర్థికాభివృద్ధిని సాధించేందుకు అనువైన ప్రాతిపదికలు వేయడానికై కొన్ని ప్రాథమిక ఆధారాలను అభివృద్ధి పరచడమే మొదటి ప్రణాళిక లక్ష్యం.

భారతదేశ గ్రామసీమలను పునర్నిర్మించడం, పారిశ్రామికాభివృద్ధికి పునాదులు వేయడం, సంఘంలో వెనుకబడివున్న పేదప్రజలు బాగుపడడానికి సాధ్యమైనన్ని ఎక్కువ అవకాశాలు కలిగించడం, దేశంలోని అన్ని ప్రాంతాలు హెచ్చుతగ్గులు లేకుండా సమంగా అభివృద్ధి చెందునట్లు చేయడం—ఇవి రెండవ ప్రణాళిక లక్ష్యాలు.

ఆంధ్రప్రదేశ్ రెండవ ప్రణాళికకు రూ. 175.37 కోట్ల ఖర్చు తలపెట్టబడింది. ఇందులో ఆంధ్రప్రాంతానికి రూ. 119.87 కోట్లు, తెలంగాణా ప్రాంతానికి రూ. 55.50 కోట్లు, అంటే రాష్ట్రం మొత్తంమీద రూ. 175 కోట్ల వ్యయం తలపెట్టబడింది. ఈ వ్యయం భారతదేశంలోని అన్నిరాష్ట్రాల ప్రణాళికల వ్యయానికి 7.8 శతి అన్నమాట.

ఈ మొత్తంకాక సహకార చక్కెర ఫ్యాక్టరీకి రూ. 19 లక్షలు, వ్యవసాయానికి రూ. 10.95 లక్షలు, సాంఘిక ఆరోగ్య పథకాలకు రూ. 7.73 లక్షలు—మొత్తం రూ. 37.68 లక్షలను అవిభక్త హైద్రాబాదురాష్ట్ర ప్రణాళికకు కేటాయింప బడనట్టి నిధులనుంచి ఇప్పుడు కేటాయించి తెలంగాణా ప్రణాళిక వ్యయాన్ని రూ. 56.87 కోట్లకు హెచ్చించవలసిందిగా ప్లానింగ్ కమీషన్‌ను కోరడమైనది.

ఆంధ్రప్రదేశ్ జనాభా భారతదేశ మొత్తం జనాభాకు 8.8 శతి వుంది. కనుక జనాభా ప్రాతిపదికనుబట్టి చూచినా ఆంధ్రప్రదేశ్‌కు రూ. 199 కోట్లు కేటాయించాలి. అంటే ప్లానింగు కమీషన్‌వారు నిర్ణయించిన మొత్తంకంటె ఇంకా రూ. 24 కోట్లు అదనంగా రావడం న్యాయం.

పైన పేర్కొనబడిన వ్యయంలో స్థానిక పరిపాలనా సంస్థలు అభివృద్ధి పథకాలకు పెట్టేఖర్చు చేర్చబడలేదు. రాష్ట్రప్రభుత్వం స్వయంగా ఖర్చు భరించునట్టి పథకాలకు అయ్యే వ్యయమే ప్రణాళిక కేటాయింపులలో చేర్చబడింది. అందులో ప్రజలు వారివారి ప్రాంతాలలో వస్తురూపంలోను, విరాళాల రూపంలోను, కాయకష్టం రూపంలోను చేసే సహాయం కూడా చేర్చబడలేదు. ఆ విరాళాలు, ఆ సహాయం లెక్కకట్టినట్లయితే చాలా హెచ్చుమొత్తమే అవుతుంది అయితే దేశం మొత్తంమీద అయ్యే వ్యయంలో ఆ సహాయం తప్పే మార్పులు చేయజాలదు.

అన్నిటికంటె ఎక్కువ మొత్తం రాష్ట్రంలో సాగునీటి వనర్లు, విద్యుచ్ఛక్తి అభివృద్ధికై కేటాయించబడింది. ఆంధ్రప్రాంతానికి కేటాయింపబడిన వ్యయానికి 45 శతి, తెలంగాణాకు కేటాయింపబడ్డ వ్యయానికి 40 శతి మొత్తం సాగునీరు, విద్యుచ్ఛక్తి కార్యక్రమాలకు కేటాయింపబడింది. అనగా ఆంధ్రకు రూ. 5399.87 లక్షలు, తెలంగాణాకు రూ. 2246.90 లు కేటాయింపబడ్డవి. ఆ తరువాత ఎక్కువమొత్తం వ్యవసాయానికి కేటాయింప బడింది. ఆంధ్ర మొత్తంవ్యయంలో 22 శతి, తెలంగాణా మొత్తం వ్యయంలో 25 శతి, వ్యవసాయానికి కేటాయింప బడింది. అనగా ఆంధ్రకు రూ 2612.80 లక్షలు, తెలంగాణాకు 2246.90 లక్షలు కేటాయింపబడ్డవి. ఇంతమొత్తం శతిని కేటాయించడానికి కారణమేమంటే జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు సామాజికాభివృద్ధి కార్యక్రమానికి మొత్తం రూ 15 కోట్లు అవుతాయి. అందులో ఆంధ్రకు 10 కోట్లు తెలంగాణాకు రూ. 5 కోట్లు, మూడవ పెద్ద మొత్తం సంఘసేవా కార్యక్రమాలకు కేటాయింపబడింది. ఆంధ్రకు 18 శతి అనగా రూ. 2135.99 లక్షలు, తెలంగాణాకు 24 శతి అనగా 1306.85 లక్షలు కేటాయింప బడ్డవి. రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధికి అంటే గ్రామీణ స్వల్ప పరిశ్రమలకు

[illegible] ఆంధ్రకు 9 శతం అవగా రూ. 1040.90 లక్షలు, తెలంగాణాకు 7 శతం అవగా రూ. 385 05 లక్షలు కేటాయింప బడ్డవి.

జాతీయ ప్రణాళికలో ఏయే అంశాలకు ప్రాధాన్య మివ్వబడిందో ఆంధ్ర ప్రణాళికలో కూడా ఆ అంశాలకే ప్రాధాన్య మివ్వబడింది. అయితే ఒక్క వ్యవసాయం, సామాజికాభివృద్ధి విషయంలోమాత్రం రెంటికీ తేడావుంది. జాతీయ ప్రణాళికలోవ్యవసాయం, సామాజికాభివృద్ధియొక్క వ్యయం శతి తగ్గించబడింది. కాని ఆంధ్ర ప్రణాళికలో మొదటి ప్రణాళిక కంటె రెండవ ప్రణాళికలోనే వ్యవసాయం, సామాజికాభివృద్ధి పద్దుకు హెచ్చుమొత్తం కేటాయింప బడింది. ఇందుకు ముఖ్య కారణం మన రాష్ట్రం వ్యవసాయ ప్రధానమైన రాష్ట్రం కావడమే.

## ధన వసతి

ఆంధ్రప్రదేశ్ రెండవ ప్రణాళికకు మొత్తం రూ. 175 కోట్లు వ్యయం తలపెట్టబడిందని ఇదివరకే చెప్పివున్నాము. అయితే ద్రవ్యాధారాలనుబట్టి చూస్తే రూ. 112 కోట్లు లోటు కన్పిస్తుంది. కేంద్రప్రభుత్వంనుంచి రూ. 104 కోట్ల ఋణం లభిస్తుందనిఆశింపబడుతున్నది.అప్పటికీ ఇంకారూ. 8కోట్లు లోటు వుంటుంది. అయితే అమలు జరుపవలెనని తలపెట్టబడ్డ వివిధ పథకాలవల్ల వాటి ఖర్చులుపోను దాదాపు రూ. 13 కోట్లు రాష్ట్ర ప్రభుత్వానికి లభించ గలవు. ద్రవ్యాధారాలను అంచెనా కట్టడంలో ఓపెన్ మార్కెటునుంచి లభించే రూ. 26.7 కోట్ల ఋణం (ఆంధ్ర నుంచి రూ. 20 కోట్లు, తెలంగాణానుంచి రూ. 6.7 కోట్లు) కూడా లెక్కలోకి తీసుకోబడింది. భారత ప్రభుత్వమూ, రిజర్వు బ్యాంకువారూ ఇచ్చిన సలహాను పురస్కరించుకొని రాష్ట్ర ప్రభుత్వం 1957-58 లో ప్రజలవద్దనుంచి అప్పు చేయడంలేదు. ఇదివరకటి అంచెనాలనుబట్టి చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంవల్ల రూ. 3 కోట్లు లభిస్తాయని అంచెనా. కాని అంతకంటె ఎక్కువగానే అంటే రూ. 8.2 కోట్లు లభించగలవని ఆశింపబడుతున్నది. చిన్న మొత్తాలద్వారా వసూలైన మొత్తంలో మూడింట రెండువంతుల మొత్తం రాష్ట్రానికి లభించగలదన్న కారణంతో ఇలా అంచెనా వేయబడుతున్నది.

## సాధించదలచిన అభివృద్ధి

పనులు : మొదట ఇప్పుడు పనులులేకుండా వున్న వారికీ, జనాభా పెరగడంచేతనూ సాంఘిక, ఆర్థిక వ్యవస్థలలో మార్పులు రావడంచేతనూ పనులకొరకై వెదుకుతూ వున్న వారికీ, కొన్ని ప్రాజెక్టుల నిర్మాణం పూర్తి అయిన తరువాత పనులులేకుండా పోయినవారికీ, వ్యవసాయంలోనూ ఇంటి పనులలోనూ చేతినిండా పని లేకున్నవారికీ పనులు కల్పించడమే ప్రభుత్వ విధానం.

ప్రైవేటు రంగానికి పెట్టబడే పెట్టుబడి ప్రభుత్వ రంగంలో పెట్టబడే పెట్టుబడికి రెట్టింపు వుండగలదని అనుకుంటే ఆంధ్రప్రదేశ్ రెండవ పంచవర్ష ప్రణాళికకు ప్రభుత్వపెట్టుబడి రూ. 175కోట్లు, ప్రైవేటురంగము పెట్టుబడి రూ. 58 కోట్లు, మొత్తం రూ. 233 కోట్ల పెట్టుబడి వల్ల దాదాపు 2.6 లక్షల మందికి పనులు ఉద్యోగాలు దొరకాలి. ఇట్లా దీనివల్ల, ఇదిగాక ప్రణాళికకు సంబంధించిన వివిధ పథకాలు అమలు జరగడంవల్ల అదనంగా దొరికే పనులవల్ల మొత్తం 2.69 లక్షలమందికి పనులు దొరకాలి. దీనికితోడు వాణిజ్య వ్యాపారాలలో 52 శతి ఉద్యోగాలు లభిస్తాయని ఆశించబడుతూవున్నది. 2.69 లక్షలు, ఈ 52 శతి కలిస్తే మొత్తంమీద దాదాపు 4 లక్షలమందికి పనులు దొరుకుతాయి. ఇందులో నూనెశుద్ధి కర్మాగారాలు, మొదలగు ప్రయివేటు రంగాలలోను, తంతితపాలా మొదలగు కేంద్ర ప్రభుత్వరంగంలోను దొరికే ఉద్యోగాలు చేర్చబడలేదు. వీటివల్ల కనీసం ఒక లక్షమందికి ఉద్యోగాలు దొరుకుతాయని ఆశిద్దాం. అప్పుడు ఈ రాష్ట్రంలో 5 లేక 6 లక్షలమందికి పనులు దొరుకుతాయన్నమాట. ఉద్యోగ పరిస్థితి ఈవిధంగా అనుకూలంగా మారడానికి కారణం రెండవ ప్రణాళికలో నీటిపారుదల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులపై పెద్ద మొత్తాలు పెట్టుబడి పెట్టబడడమే. ఈ ప్రాజెక్టులవల్ల ఎక్కువమంది పనివారలకు పనులుదొరుకుతాయి.

## వ్యవసాయోత్పత్తి

మనరాష్ట్రంలో 82.6 శతి జనాభా గ్రామాలలో నివసిస్తూవుంది. అందుచేత వ్యవసాయానికి హెచ్చు ప్రాముఖ్య మివ్వవలసిన అగత్యమేర్పడుతున్నది.

రెండవ పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయ కార్యక్రమం వల్ల పెరుగుతూవున్న జనాభాకు తగువిధంగా ఆహార ధాన్యాలు లభింపజేయబడాలి. అంతేగాక అనుదినము ప్రవర్ధమాన మవుతూవున్న మన పారిశ్రామిక వ్యవస్థకు అవసరమయ్యే ముడిసామగ్రిని కూడా లభింప జేయాలి. ఇతర దేశాలకు ఎగుమతి జేయడానికై వ్యవసాయోత్పత్తులను అధికంచేయాలి.

రెండవ ప్రణాళికలో వ్యవసాయాభివృద్ధికై మొత్తం 150 పథకాలు చేపట్టబడుతాయి. అంటే ఆంధ్రలో 81 పథకాలు, తెలంగాణాలో 69 పథకాలు. ఈ మొత్తం పథకాలకు మొత్తం రూ. 687.36 లక్షలు ఖర్చు అవుతాయని అంచెనా. అనగా ఆంధ్ర పథకాలకు రూ. 462.67 లక్షలు, తెలంగాణా పథకాలకు రూ. 224.69 లక్షలు అవుతాయి. దీనికి తోడు అవిభక్త హైద్రాబాదురాష్ట్ర ప్రణాళికకు కేటాయింప బడినట్టి నిధినుంచి రూ. 10.95 లక్షలను వ్యవసాయానికై కేటాయించ వలసిందిగా ప్లానింగు కమీషన్ వారిని కోరడమైనది.

## ఆంధ్ర

వ్యవసాయోత్పత్తులను అధికం చేయడానికి ఈ దిగువ అభివృద్ధి కార్యక్రమాలు తోడ్పడుతాయి. స్వల్పనీటి పారుదల పనులు: మేలురకం విత్తనాలను ఎరువులను రసాయనిక ఎరువులను విశేషంగా ఉపయోగించడం, బంజరు భూములను బాగుపరచి సాగుకు తేవడం, అట్టిభూములను అభివృద్ధి పరచడం; సేద్యంక్రిందికి ఎక్కువ భూములను తేవడం. ఈ విధంగా రెండవ ప్రణాళిక అంతమయ్యేసరికి 300 విత్తనాల క్షేత్రాలను ఏర్పాటు చేయాలనీ, 300 స్టోర్సును నిర్మించాలనీ తలపెట్టబడింది. 34,785 టన్నుల వరివిత్తనాలు ,9,594టన్నులజొన్నలు,21,405టన్నుల వేరుసెనగ, 20,25 టన్నుల పప్పుధాన్యాలు, 646 టన్నుల పచ్చి ఎరువు విత్తనం, 8.35 లక్షల కొబ్బరి మొక్కలు రైతులకు పంపిణీచేయబడుతాయి. 12 లక్షల టన్నుల పట్టణ కంపోస్టు ఉత్పత్తిచేయబడి పంపిణీ చేయబడుతుంది. అదనంగా సాగునీటి సౌకర్యం కలిగించడానికై 2,000 ఫిల్టర్ పాయింట్ గొట్టపుబావులను త్రవ్వించడానికి తగు మొత్తాలు కేటాయింపబడ్డవి. రైతులకు 375 ట్రాక్టర్లు, 710 ఎలక్ట్రిక్ మోటార్లు, 550 ఆయిల్ ఇంజనులు అద్దె-కొనుగోలు పద్ధతిపై సప్లయి చేయబడుతాయి. 250 ఆర్టీసియన్ బావుల త్రవ్వకానికి అప్పులివ్వబడుతాయి.

## తెలంగాణా

తెలంగాణా ప్రణాళికకూడా ఆంధ్రప్రణాళిక పద్ధతి ప్రకారమే రూపొందించబడింది. రెండవప్రణాళికకాలంలో 147 విత్తనాల క్షేత్రాలను, విత్తనాలస్టోర్సును ఏర్పాటు చేయవలెనని తలపెట్టబడింది. 17,177 టన్నుల వరివిత్తనాలు, 991 టన్నుల జొన్నలు. 248 టన్నుల గోధుమ, 1,988 టన్నుల మొక్కజొన్న, 53 టన్నుల పప్పుధాన్యాలు, 81,700 టన్నుల చెరకు, 5,716 టన్నుల ప్రత్తి, 2,232 టన్నుల ఆముదాలు, 300 టన్నుల ఇతర నూనె గింజలు, 1101 టన్నుల పచ్చి ఎరువు విత్తనం పంపిణీ చేయబడుతాయి. 15,176 టన్నుల సూపర్ ఫాస్ఫేట్ 92 టన్నుల సల్ఫర్ సప్లయి చేయబడుతాయి. 5,30,010 టన్నుల కంపోస్టు ఉత్పత్తి చేయబడుతుంది. సాగునీటి సౌకర్యం బాగా కలిగించడానికై 5 లిఫ్ట్ ఇర్రిగేషన్ ప్రాజెక్టుల పని చేపట్టబడుతుంది. 682 బావులను బోరింగుచేసి నిర్మింపవలెననీ, 1,028 ఆయిల్ ఇంజనులను నెలకొల్పవలెననీ, కొత్తగా 2,152 బావులను త్రవ్వవలెననీ, 1,985 పాతబావులను మరమ్మతు చేయవలెననీ తలపెట్టబడింది.

ప్రభుత్వ ట్రాక్టర్లద్వారా నైతేనేమి, ప్రైవేటు ట్రాక్టర్ల ద్వారానైతేనేమి మొత్తం 42,135 ఎకరాల భూమిని ప్రణాళిక కాలంలో సేద్యం క్రిందికి తేవలెనని తలపెట్టబడింది. 99,400 ఎకరాలకు మేలు కలుగునట్లుగా మొక్కల సంరక్షణ చర్యలు గైకొన బడుతాయి.

## స్వల్ప నీటిపారుదల ఏర్పాట్లు

భారతదేశ వ్యవసాయం ఎక్కువగా ఋతుపవనాలమీద ఆధారపడి వుంటున్నది. వర్షాలు కురిస్తే పండడం, లేక పోతే ఎండడం—ఇదీ మన పరిస్థితి. కాని తగు సాగునీటి ఏర్పాట్లుగనుక చేసినట్లయితే ఈ దుస్థితి తొలగిపోతుంది. ఈ విషయంలో స్వల్ప నీటిపారుదల పనులు ముఖ్యపాత్ర వహిస్తాయి.

అందుచేతనే రాష్ట్రంలో స్వల్ప నీటి పారుదల పనులకై రెండవ ప్రణాళికలో రూ. 443.92 లక్షలు కేటాయింపబడ్డవి. ఆంధ్రప్రాంతానికి రూ. 242.90 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రూ. 201.02 లక్షలు.

ఆంధ్రప్రాంతంలో రెండవ ప్రణాళిక కాలంలో పాడుబడివున్న 570 చెరువులను తగువిధంగా మరమ్మతుచేసి బాగుపరచడమవుతుంది. ఇందువల్ల 49000 ఎకరాలకు సాగునీరు లభిస్తుంది. ఇప్పుడు ఆ చెరువులక్రింద నీటి సరఫరా ఏర్పాటు చాలా అసంతృప్తికరంగా వుంది. ఇతర స్వల్పనీటి వనరులను ఏర్పాటుచేసి 96000 ఎకరాలకు సాగునీరు సరఫరా చేయబడుతుంది.

తెలంగాణాప్రాంతంలో ప్రథమ ప్రణాళికలో పని పూర్తి కాకుండా 598 చెరువులు మిగిలిపోయాయి. ఇవి తెగిపోయిన చెరువులు. వీటిని ఇప్పుడు మరమ్మతుచేసి 65,527

ఎకరాల ఆయకట్టుకు సాగునీరు సరఫరా చేయబడుతుంది. ఇది గాక అదనంగా 1,247 చెరువులు మరమ్మతు చేయ బడగలవు. వాటిక్రింద 75,085 ఎకరాల ఆయకట్టువుంది. స్వల్పనీటి పారుదల పనులలో పాలేరు, పాతచెరువు, కట్టెలచెరువు, కేశవపట్నం, పెదవాగుపాయ, జంగిల్‌నాలాల పనులను ప్రారంభించి, పూర్తిచేయడ మవుతుంది.

రెండవ ప్రణాళిక అంతమయ్యేసరికి ఈ ఆరు నీటి పన రులవల్ల మొత్తం 11,240 ఎకరాల ఆయకట్టుకుగాను 4,?40 ఎకరాల భూమి అభివృద్ధి అవుతుంది. మిగిలినవి ఆ తరు వాత అభివృద్ధి పరచబడుతుంది.

## భూమి అభివృద్ధి

రెండవ ప్రణాళికలో భూమి అభివృద్ధికై మొత్తం రూ. 39.88 లక్షలు కేటాయింపబడ్డవి. ఆంధ్రకు రూ. 30.00 లక్షలు, తెలంగాణాకు రూ. 9.88 లక్షలు.

ఆంధ్రప్రాంతంలో రెండవ పంచవర్ష ప్రణాళికలో రైతుల అవసరాలను తీర్చడానికై 44 బుల్‌డోజర్లను సేక రించవలెనని తలపెట్టబడింది. తెలంగాణాప్రాంతంలో 11050 ఎకరాల బంజరు భూములను అభివృద్ధిపరచి సాగుకు లాయకు చేయడమవుతుంది. అంతేగాక 8125 ఎకరాల పొద అడవులనుకూడా బాగుచేయడ మవుతుంది.

## పశుసంరక్షణ

మారుమూలలనున్న గ్రామాలకుసైతం పశువైద్యపు సౌకర్యం కలుగజేసి, పశుగణమును అభివృద్ధి పరచడమే ప్రణాళిక లక్ష్యం. మొత్తంపై 84 పథకాలు ప్రారంభింప బడుతాయి. ఆంధ్రలో 55 పథకాలు, తెలంగాణాలో 29. వీటికి రూ. 335.30 లక్షలు ఖర్చు అవుతుంది. తెలంగా ణాకు రూ. 83.51 లక్షలు, ఆంధ్రకు రూ. 251.79 లక్షలు.

ప్రణాళికకు సంబంధించిన వివిధ పశువైద్య పథకాలను అమలుపరచవలెనంటే పశువైద్య పట్టభద్రుల కొరత ఎక్కువగా వున్నది. ఈ కొరతను తీర్చడానికై బాపట్లలోని పశువైద్య కళాశాలలో 468 మంది పట్టభద్రులకు శిక్షణ ఇవ్వవలెనని తలపెట్టబడింది. పశుపోషణలో 4 గురికీ, డైరీ విధానాలలో నలుగురికీ ఆధునిక విధానాలలో శిక్షణ ఇప్పించడానికై వారినివిదేశాలకు పంపడమవుతుంది. మారు మూల గ్రామాలకు కూడా పశువైద్య సౌకర్యాలు కల్పించి, పశువుల అంటువ్యాధులను అరికట్టడానికై 28 పశువైద్య సంస్థలు, 77 చిన్నపాటి పశువైద్య ఆసుపత్రులను, 21 సంచారక పశువైద్య దళాలు, పశువులకు ప్రథమ చికిత్సకై 105 కేంద్రాలు నెలకొల్పబడుతవి. పశురోగములను త్వరగా నిదానంచేసి, ఎక్కడికక్కడ సకాలంలో వైద్య సహాయం కలుగజేయడానికై ఒక క్లినికల్ లేబొరేటరీ ఒక పశువులక్షేత్రం నెలకొల్పబడగలవు.

ఈ రాష్ట్రంలో మాంసమును, ఉన్ని బొచ్చును, ఎక్కు వగా ఇచ్చే గొర్రెలను అభివృద్ధి పరచడానికీ, ఉన్నివి విదేశాలకు ఎగుమతిచేసే అవకాశం కలిగించడానికీ అనంతపురం జిల్లాలో గొర్రెల పెంపక కేంద్రం నెలకొల్ప బడుతుంది. అక్కడ అందుకు తగు వీలున్నది.

గుంటూరులోని రాణీఖేత్‌జబ్బు వాక్సిన్ ప్రయోగశాలకు రెండవ ప్రణాళిక కాలంలో అదనపు యంత్ర సామగ్రి సమకూర్చబడుతుంది. కోళ్ళవిషయమై పరిశోధనలు సల్ప డానికై కేంద్ర కోళ్ళ పరిశోధన కేంద్రం నెలకొల్ప బడు తుంది. కోళ్ళ పెంపకం నిమిత్తమై భారతప్రభుత్వం ఒక పథకం తలపెట్టింది. ఆపథకము ననుసరించి కేంద్ర ప్రభుత్వం సరఫరాచేసిన కోళ్ళను రాష్ట్ర కోళ్ళ పెంపక కేంద్రాలలో పెంచి, వాటి జాతిని వృద్ధిచేసి, వాటిని సామాజి కాభివృద్ధి బ్లాకులలో, జాతీయ విస్తరణ సేవా కేంద్రాలలో పంపిణీ చేయవలసి వుంటుంది. రెండవ ప్రణాళిక కాలంలో 1955-56 లో పలమనేరులో ఒక కోళ్ళ పెంపక కేంద్రం ప్రారంభింప బడింది. ఆంధ్ర ప్రాంతంలో మరికొన్ని ప్రారంభింపబడగలవు.

ఒకచోట స్థిరనివాసం లేకుండా దేశం తిరుగుతూ జంతువులను పెంచేవారి కొరకై రెండవ ప్రణాళికలో ఒక పశుపోషక సంస్థ నెలకొల్పబడగలదు.

తెలంగాణా ప్రణాళికలో 13 స్టేషనరీ పశువైద్యశాలలు, 51 గ్రామీణ పశువైద్య శాలలను తెరుపడమేగాక మందు లకు యంత్రసామగ్రికి అదనపు గ్రాంటు కూడా ఇవ్వబడు తుంది. నల్లగొండలో ఉన్ని సాంకేతిక ప్రయోగశాల, ఒక గొర్రెల పెంపకకేంద్రం, ఇతరచోట్ల గొర్రెలు, ఉన్ని అభి వృద్ధి కేంద్రాలు, హైద్రాబాదులో కేంద్ర కోళ్ళ పెంపక కళాశాలఇతరచోట్ల కోళ్ళ అభివృద్ధి కేంద్రాలు నెలకొల్పబడ గలవు.ఈపథకాలన్నిటికీ సిబ్బందినిసమకూర్చడానికై హైద్రా బాదులో ప్రారంభింపబడిన రెండేళ్ళ ఎమర్జెన్సీ డిప్లొమా కోర్సులో రెండవ జట్టుగా 100 మంది విద్యార్థులను చేర్చుకోవడమవుతుంది. స్టాక్‌మెన్ ట్రెయినింగు, పౌల్ట్రీ ట్రెయినింగు మొదలగు స్వల్పకాలిక శిక్షణ కోర్సులు కూడా ప్రారంభింపబడ గలవు. రెండవ ప్రణాళిక కాలంలో

రిండర్ పెస్టు వ్యాధి నిర్మూలనకు కూడా తగు ప్రయత్నాలు చేయబడుతాయి.

## డేరీ, పాల సరఫరా

రెండవ ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో 8 పథకాలను అమలుపరచవలెనని తలపెట్టబడింది. ఆంధ్రలో 5 పథకాలు. తెలంగాణాలో 3 పథకాలు. వీటికి మొత్తం రు. 82.65 లక్షలు ఖర్చు అవుతాయి. ఆంధ్రకు ఖర్చు రూ. 57.70 లక్షలు, తెలంగాణాకు ఖర్చు రు. 24.95 లక్షలు.

ఆంధ్రలో ప్రస్తుతం వున్నట్టి పాల సరఫరా సహకార సంఘాలను బలపరచి, కొత్తసంఘాలను పెట్టడంద్వారా పట్టణాలకు పాల సరఫరా వృద్ధిచేబడుతుంది. రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో పాలు మిగులుగా లభిస్తాయిగనుక ఆంధ్రప్రాంతములో రెండు పాల పొడరు ఫ్యాక్టరీలను స్థాపించవలెనని తలపెట్టబడింది. ఇప్పుడు విదేశాలనుంచి హెచ్చు మొత్తంలో పాలపొడరు దిగుమతిచేసుకుంటున్నాం. ఇక్కడేగనుక అట్టిఫ్యాక్టరీ లున్నట్లయితే లాభసాటియైన పరిశ్రమ ఒకటి మనకు ఏర్పడడమేగాక దిగుమతి చేసుకోవలసిన అగత్యంకూడా వుండదు.

రెండవ ప్రణాళిక కాలంలో ఒక పాల బోర్డు నెలకొల్పబడుతుంది.

తెలంగాణాలో హైద్రాబాదు, సికింద్రాబాదు జంట నగరాలలో పాలసరఫరా సౌకర్యాన్ని హెచ్చించడానికై రెండవ ప్రణాళిక కాలంలో ఒక సహకార పాలసరఫరా యూనియన్ నెలకొల్పబడుతుంది. పాల ఉత్పత్తి రోజుకు 10,000 యం. యం. వరకు హెచ్చింపబడుతుంది.

## అడవులు

మొదటి ప్రణాళికలో మిగిలిపోయిన అభివృద్ధి కార్యక్రమాలను రెండవ ప్రణాళికలోకూడా కొనసాగించి, అటవీ సంపదను రాష్ట్రానికి ఎక్కువ ప్రయోజనకరం చేయడానికి అటవీశాఖ కార్యకలాపాలను విస్తరింపచేయవలెనని తలపెట్టబడింది. రెండవ ప్రణాళికలో మొత్తం 30 పథకాలను అమలుపరచవలెనని సంకల్పించబడింది. ఆంధ్రలో 11, తెలంగాణాలో 19. వీటికయ్యే మొత్తంఖర్చు రూ. 115.12 లక్షలు. ఆంధ్ర ఖర్చు రూ. 69.47 లక్షలు, తెలంగాణా ఖర్చు రూ. 45.65 లక్షలు.

కర్నూలు జిల్లాలో ఒక వెదురుపని శిక్షణకేంద్రం, తూర్పు గోదావరి జిల్లాలో ఒక లక్క కేంద్రం, కడప, చిత్తూరుజిల్లాలలో ఒక అభయారణ్యం నెలకొల్పబడుతాయి. కర్నూలు కడప జిల్లాలలో 399 మైళ్లు, ఏజన్సీ ప్రాంతంలో 286 మైళ్ళ పొడవు రోడ్లుఅభివృద్ధి పరచబడుతాయి.

అగ్గిపుల్లలకు పనికివచ్చే కర్రకు ఎక్కువ డిమాండు వుంది. అందుచేత ఆ అవసరాన్ని తీర్చడానికై తెలంగాణా ప్రాంతంలో వరంగల్లు జిల్లాలో ప్రతియేటా 50 ఎకరాల భూమిలో మెత్తని కర్ర ఇచ్చే చెట్లు నాటబడుతాయి. మెదకు, వరంగల్లు, హైద్రాబాదు జిల్లాలలో 4 అభయారణ్యాలు స్థాపించబడుతాయి.

## భూసార పరిరక్షణ

రెండవ పంచవర్ష ప్రణాళికలో భూసారపరిరక్షణకై 14 పథకాలు తలపెట్టబడ్డవి. ఆంధ్రకు 12 పథకాలు, తెలంగాణాకు 2 పథకాలు. వీటికయ్యే మొత్తం ఖర్చు రు. 101.79 లక్షలు. ఆంధ్ర ఖర్చు రూ. 72.96 లక్షలు, తెలంగాణా ఖర్చు రూ. 28.83 లక్షలు.

రెండవ ప్రణాళికతో అమలు పరచబడే వివిధ పథకాల వల్ల ఆంధ్రప్రాంతంలో 96476 ఎకరాలకు మేలు కలుగుతుంది. తెలంగాణా ప్రాంతంలో రుద్రూరులో భూసార పరిశోధక కేంద్రమును నెలకొల్పవలెననీ, 32,750 ఎకరాలలో వరదకట్టలు వేయవలెననీ రెండవప్రణాళికలో తలపెట్ట బడింది.

## సహకారం

గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పునర్వ్యవస్థీకరించడానికై సహకార రంగం విస్తృతంగా ఉపయోగించుకోబడుతుంది. గ్రామాన్ని సహకారపద్ధతిపై మేనేజిమెంటు చేయడం మన లక్ష్యం. అంటే వ్యవసాయోత్పత్తి, గ్రామీణ పరిశ్రమలు, గ్రామంలో వ్యాపారం మొదలయినవన్నీ సహకారసంఘాల ద్వారా నిర్వహింపబడుతాయి. గ్రామీణ పరపతినీ, మార్కెటింగునూ పునర్వ్యవస్థీకరించడానికై తగు చర్యలు గైకొనబడుతున్నవి.

రెండవ ప్రణాళికలో ఆంధ్రలో 9, తెలంగాణాలో 8, మొత్తం 17 పథకాలను ప్రారంభించవలెనని తలపెట్టబడింది. వీటికయ్యే మొత్తంవ్యయం రూ. 214.22 లక్షలు. ఆంధ్ర వ్యయం రూ. 98.71 లక్షలు. తెలంగాణా వ్యయం 115.51 లక్షలు.

ఆంధ్ర ప్రాంతంలో కొన్ని నిర్ణీత ప్రాంతాలలో ప్రాథమిక స్థాయిలో 584 పెద్దతరహా సంఘాలను ఏర్పాటు

చేయడంద్వారానూ, అన్ని స్థాయిలలో రూ. 175 లక్షల మేరకు ప్రభుత్వంకూడా భాగస్వామ్యం వహించడం ద్వారానూ, ఇప్పుడున్న చిన్నచిన్న సంఘాలలో సూపర్వయిజరీ ఉద్యోగులను అదనంగా ఏర్పాటుచేసి వాటిని పునరుజ్జీవింప చేయడంద్వారానూ సహకారపరపతి వ్యవస్థను బలపరచవలెనని తలపెట్టబడింది. వ్యవసాయోత్పత్తులకూ, వాటి అభివృద్ధికీ 1955-56 లో స్వల్పకాలిక, మధ్యకాలిక, దీర్ఘకాలిక, ఋణాలక్రింద రూ. 8 కోట్లు ఇవ్వబడ్డవి. ఇప్పు డీఋణాలను క్రమేణా ప్రణాళిక అంతంపరకల్లా రూ. 20 కోట్లకు హెచ్చవలెనని ఒక లక్ష్యం నిర్ణయించబడింది. అంటే రాష్ట్రంలోని మొత్తం వ్యవసాయ పరపతిలో 20 శతి హెచ్చింపు అన్నమాట. 50 శతి లక్ష్యాన్ని ఆ తరువాత 10 ఏండ్లలో సాధించవలెనని ఉద్దేశింపబడింది.

తెలంగాణా ప్రాంతంలో ప్రభుత్వ భాగస్వామ్యం, దబ్బిచ్చి మేనేజిమెంటు చేయించడం, పరిమిత బాధ్యతలతో 191 పెద్దతరహా సంఘాలను ఏర్పాటు చేయవలెననీ, 23 ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులను, 50 ప్రాథమిక మార్కెటింగ్ సొసైటీలను నెలకొల్పవలెనని తలపెట్టబడింది. మార్కెటింగు సొసైటీలు 25 గిడ్డంగులు, పెద్దతరహా సంఘాలు 40 గిడ్డంగులను నిర్మిస్తాయి. వ్యవసాయోత్పత్తి నిమిత్తమై ఇచ్చే స్వల్పకాలిక, మధ్యకాలిక, దీర్ఘకాలక ఋణాలమొత్తం క్రమేపీ హెచ్చింపబడుతుంది.

## గిడ్డంగులు, మార్కెటింగు

వ్యవసాయోత్పత్తులను నిలువచేయడానికై ఆంధ్ర ప్రాంతంలో 212 గిడ్డంగులను నిర్మింపజేయడానికి మార్కెటింగు సహకార సంఘాలకు, పెద్దతరహా సంఘాలకు తగువిధంగా ఆర్థిక సహాయం చేయవలెనని తలపెట్టబడింది. మార్కెటింగు సంఘాలు 61 యూనిట్లను, పెద్దతరహా సంఘాలు 151 అక్సిలియరీ గిడ్డంగులను నిర్మిస్తాయి. అన్ని జిల్లాలకు జిల్లా మార్కెటింగ్ సహకార సంఘాలు, ఒక జిల్లాకూ మరొక జిల్లాకూ మధ్యనూ ఇతర రాష్ట్రాలతోటీ వ్యాపారం చేయడానికి ఒక కేంద్ర మార్కెటింగ్ సంఘం ఏర్పాటు చేయవలెనని సంకల్పించ బడింది. ప్రాథమిక సంఘాలు కూడా ఎగుమతి కార్యకలాపాలను చేపట్ట జేయునట్లు తలపెట్టబడింది. వ్యవసాయ దారులకు వారి వ్యవసాయోత్పత్తులు నిలువచేసుకొనడానికి సౌకర్యం కలిగించడానికై రూ. 40 లక్షల చెల్లించబడిన మూలధనంతో రాష్ట్ర గిడ్డంగుల కార్పొరేషన్‌ను నెలకొల్పుటకు తలపెట్టబడింది.

తెలంగాణా ప్రాంతంలో ప్రస్తుతం 39 రెగ్యులేటెడ్ మార్కెట్లు వున్నవి. వీటికితోడు రెండవ ప్రణాళికలో మరి 10 మార్కెట్లను పెట్టవలెనని సంకల్పించ బడింది. ఇంతవరకూ ప్రత్తి, వ్యవసాయోత్పత్తులు, పశుగణమునకు మాత్రమే రెగ్యులేషన్ వర్తిస్తున్నది. రెండవ ప్రణాళిక కాలంలో పండ్లు, కూరగాయలనుకూడా చేర్చవలెనని తలపెట్టబడింది.

రెండవ ప్రణాళికలో 9 పథకాల పని ప్రారంభింపబడుతుంది. ఆంధ్రలో 4, తెలంగాణాలో 5. వీటికయ్యే మొత్తం వ్యయం రూ. 203.32 లక్షలు. ఆంధ్రవ్యయం రూ. 186.53 లక్షలు. తెలంగాణా వ్యయం రూ. 16.79 లక్షలు.

## సామాజికాభివృద్ధి

మొదటి ప్రణాళికలో ప్రారంభింపబడ్డ సామాజికాభివృద్ధి కార్యక్రమం సత్ఫలితాల నిచ్చింది. ఇంకా కొన్ని లోట్లను పూరించవలసివున్నది. ఈ పని రెండవ ప్రణాళికలో జరుగుతుంది. పంచాయితీలు, సహకారసంఘాలు, గ్రామీణ స్వల్ప పరిశ్రమలు, స్త్రీ జనాభ్యుదయం, యువజనాభ్యుదయం, గిరిజనుల సంక్షేమంవంటి కార్యక్రమాలకు ఎక్కువ శ్రద్ధ వహించబడుతుంది.

రెండవ ప్రణాళిక అంతమయ్యేసరికి దేశమంతటా జాతీయ విస్తరణ సేవా కార్యక్రమం అమలుజరుగవలెనని తలపెట్టబడింది. ఈ కార్యక్రమంక్రిందవున్న ప్రాంతంలో 40 శతి ప్రాంతం తీవ్రకృషి పథకాలద్వారా అభివృద్ధి పరచబడుతుంది. రెండవ ప్రణాళిక ముగిసేసరికి ఆంధ్ర ప్రాంతంలో 303 బ్లాకులు, తెలంగాణా ప్రాంతంలో 144 బ్లాకులు ఏర్పడుతాయి. ఈ కార్యక్రమాన్ని అమలుజరుపడానికై మొత్తం రూ. 1539 లక్షలు కేటాయింపబడ్డవి. ఆంధ్రకు రూ. 1044.996 లక్షలు, తెలంగాణాకు రూ. 494.740 లక్షలు.

## నీటి పారుదల

మొదటి ప్రణాళికలో పూర్తికాకుండా వున్న పనులు రెండవ ప్రణాళికలో కొనసాగింపబడుతాయి. వాటికితోడుగా ఆంధ్రలో రెండు భారీ ప్రాజెక్టులు, 13 మధ్యరకం ప్రాజె

ట్టులు, తెలంగాణాలో 11 మధ్యరకం ప్రాజెక్టులు ప్రారంభింపబడవలెనని తలపెట్టబడింది.

రెండవ ప్రణాళిక ముగిసేసరికి ఆంధ్రలో అదనంగా 4.04 లక్షలఎకరాలు. తెలంగాణాలో అదనంగా 2.58 లక్షల ఎకరాల భూమికి సాగునీరు లభిస్తుంది.

## విద్యుచ్ఛక్తి

1960-61 లో తలసరి విద్యుచ్ఛక్తి వినిమయం 20 యూనిట్లవరకు పెరగగలదని ఆశింపబడుతున్నది. రెండవ ప్రణాళిక ముగిసేసరికి ఆంధ్రలో 340 గ్రామాలకు, తెలంగాణాలో 77 గ్రామాలకు, మొత్తం 417 గ్రామాలకు విద్యుద్దీపాలు ఏర్పడగలవు.

## భారీ మధ్యరకం పరిశ్రమలు

నిజామాబాదులో రూ. 19.6 లక్షలతో సహకార చక్కెర ఫ్యాక్టరీని స్థాపించవలెనని తలపెట్టబడింది. ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వ సంస్థలైన రాజమండ్రిలోని ఆంధ్ర పేపరుమిల్లు, గూడూరులోని ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీలను విస్తృతంచేసి వాటి ఉత్పత్తిని హెచ్చించవలెనని నిశ్చయించబడింది. తిరుపతిలో పేపరు స్ట్రాబోర్డు మిల్లు నెలకొల్పబడుతుంది. దాని ఉత్పత్తిశక్తి రోజుకు 10 టన్నుల స్ట్రాబోర్డు. మరి 5 సహకార చక్కెర ఫ్యాక్టరీలు కూడా ఏర్పాటుచేయబడుతాయి. స్టేట్ ఫైనాన్సు. కార్పొరేషనుకు అప్పులివ్వడానికి కూడా తగు ఏర్పాటు చేయబడింది.

## గ్రామీణ స్వల్ప పరిశ్రమలు

ఆంధ్ర ప్రాంతంలో రెండవ ప్రణాళిక కాలంలో స్వల్ప పరిశ్రమలను బాగా అభివృద్ధి పరచవలెనని తలపెట్టబడింది. 35 మొదలు 40 స్వల్ప పరిశ్రమలు ప్రారంభింపబడగలవు. వీటివల్ల సైకిలు విడిభాగాలు, ఇనుపసామగ్రి, పనిముట్లు, వ్యవసాయ పనిముట్లు, చిన్న ఎలక్ట్రిక్ మోటార్లు, రేడియో రిసీవర్లు 16 యం. యం. ఫిలిం ప్రొజెక్టర్లు మొదలగు వినిమయ సరుకుల ఉత్పత్తి రాష్ట్రంలో హెచ్చుతుంది. విజయవాడ, విశాఖపట్నం, నంద్యాల, సామర్లకోటలలో 4 పారిశ్రామిక ఎస్టేట్లు నెలకొల్పబడుతాయి. వీటివల్ల పరిశ్రమలలో సామర్థ్యం హెచ్చుతుంది. ఉత్పత్తికి సార్వజనీన ప్రమాణాలు ఏర్పడుతాయి. ముడిసామగ్రినీ యంత్రసామగ్రినీ లాభసాటిగా వినియోగించుకోవడం సాధ్యమవుతుంది.

ఆంధ్ర ప్రాంతంలో గ్రామీణ పనివారలకు వివిధ కుటీర పరిశ్రమలలో శిక్షణ ఇవ్వడానికై 40 శిక్షణ కేంద్రాలను ప్రారంభించవలెనని తలపెట్టబడింది. దాదాపు 45 ఉత్పత్తి – శిక్షణకేంద్రాలు, ఇతర చిన్న పరిశ్రమలుకూడా పెట్టబడుతాయి.

పట్టు పరిశ్రమలో చాలామందికి పనులు దొరుకుతాయి, దీనివల్ల గ్రామీణ కుటుంబాలకు అదనపుపని కొంత లభిస్తుంది. కనుక ఆంధ్ర ప్రాంతంలో ఈ పరిశ్రమాభివృద్ధికై అనేక పథకాలు తలపెట్టబడ్డవి. ఇప్పుడు మల్బరీ సేద్యం క్రింద 100 ఎకరాల భూమి వుంది. దీనిని 2000 ఎకరాలకు హెచ్చించడ మవుతుంది. దీనివల్ల 3000 కుటుంబాలకు మేలు కలుగుతుంది, పారిశ్రామిక సహకార సంస్థలను నెలకొల్పుటకుకూడా తగు ఏర్పాటు వుంది. సహకార సంఘాల ద్వారా చేనేత పరిశ్రమను వృద్ధిపరచడానికి తగు మొత్తం కేటాయింపబడింది. గుంతకల్లు స్పిన్నింగుమిల్లు విస్తృతం చేయబడుతుంది. తాడిపత్రిలో సహకార నూలుమిల్లు నెలకొల్పబడుతుంది. అందులో ఏడాదికి 23,625 బేళ్ళ నూలు ఉత్పత్తి అవుతుంది.

తెలంగాణా ప్రణాళికలో ఏడాదికి 28,800 బేళ్ళ నూలును ఉత్పత్తిచేసే సహకారనూలుమిల్లు ఒకటి స్థాపించబడుతుంది. క్యాలెండరింగ్ బ్లీచింగు ఫ్యాక్టరీ ఒకటి, ప్యాటర్న్ తయారీకేంద్రాలు రెండు నెలకొల్పబడుతాయి. 3,278 మంది చేనేత పనివారలు సహకారరంగంలోకి తీసుకొనిరాబడుతారు. 40,000 మంది చేనేత పనివారికి పెట్టుబడి నిమిత్తం అప్పులివ్వబడుతాయి. సెంట్రల్ డిజైన్ యూనిట్‌గాక ఒక పారిశ్రామిక ఎస్టేటు నెలకొల్పబడుతుంది. కట్లరీ, గాజులు, గుండీలు, వస్త్రముల అద్దకం, పెన్సిళ్లు, తివాచీలు, కంబళ్లు, దంతము, కొమ్ము, కొయ్య చెక్కడం, లక్కగాజులు మొదలగు చిన్న పరిశ్రమలను రెండవ ప్రణాళికలో అభివృద్ధి పరచవలెనని తలపెట్టబడింది.

## రోడ్లు

ఆంధ్రప్రదేశ్ రెండవప్రణాళికలో రోడ్ల అభివృద్ధికి రు. లక్షలు 769 కేటాయింపబడ్డవి. ఆంధ్రకు రు. 550.42 లక్షలు, తెలంగాణాకు రు. 218.87 లక్షలు.

అనేక రోడ్లను మంచిస్థితికి తేవలెననీ, జిల్లాలలో రోడ్లు వేయవలెననీ. ఇతర రాష్ట్రాలకు మంచి రోడ్డు సౌకర్యం కలిగించవలెననీ తలపెట్టబడింది. ఈ విధంగా ఆంధ్ర ప్రాంతంలో 9 పెద్దవంతెనలు, 120 చిన్నవంతెనలు 41 చప్టావంతెనలు నిర్మింపబడుతాయి.

ఇటువంటి పథకాలన్నిటివల్ల రోడ్ల నిడివి 16743 మైళ్లు అవుతుంది. వాటిలో 937 మైళ్ళు జాతీయ రహదార్లు. 6850 మైళ్లు రాష్ట్రప్రభుత్వరోడ్లు. 8956 మైళ్ళు జిల్లాబోర్డురోడ్లు.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో తెలంగాణా ప్రాంతంలో 430 మైళ్ళ నిడివిగల క్రొత్తరోడ్లు వేయబడు తాయి. అంతేగాక మొదటి ప్రణాళికలో ఆరంభించిన రెండు వంతెనలు పూర్తిగా నిర్మించబడతాయి. మూడు నదీ వంతె నల నిర్మాణంకూడా చేపట్ట బడుతుంది. ప్రస్తుతపు రోడ్లలో 117 మైళ్ళ నిడివిగల రోడ్లు అభివృద్ధిపరచబడుతాయి. 350 మైళ్ళ రోడ్లు డస్టు ప్రూఫ్ చేయబడుతాయి.

## విద్య

మొదటి ప్రణాళిక కాలంలో ఆరంభించబడిన 22 విద్యా పథకముల (11 ఆంధ్రలోను, మిగిలిన 11 తెలంగాణా లోను గలవు.) పని రెండవ ప్రణాళిక కాలంలో కొన సాగించబడుతుంది. వీటికిగాను మొత్తం రూ. 1,279.71 లక్షలు ఖర్చు అవుతుంది. అంటే ఆంధ్రలో 775.48 లక్షలు తెలంగాణాలో 504.23 లక్షలు ఈ పథకములకొరకై ఖర్చు పెట్టబడుతాయి.

1960-61 నాటికి 6 నుంచి 11 ఏండ్లవయస్సు లోపు గల పిల్లలకు 5 9 శాతం మంది 11-14 ఏండ్ల వయస్సు గల పిల్లలకు 30 శాతం మంది, 14-17 ఏండ్ల వయస్సుగల పిల్లలకు 10 శాతం మందికి విద్యా సౌకర్యాలు కల్పించ బడుతాయని ఆశింపబడుతున్నది.

ఆర్ట్సు, సైన్సు కాలేజీల అభివృద్ధికి, ఆంధ్ర, తిరుపతి విశ్వ కళాపరిషత్తుల అభివృద్ధికీ వలసిన డబ్బు కేటాయించ బడింది.

కడపలో అంధులకుగల స్కూలు, కాకినాడలో మూగ, చెముడు స్కూలు అభివృద్ధిపరచబడుతాయి. అంగవికలుల కొరకై స్కూళ్ళు నడుపు ప్రయివేటు ఏజన్సీలకు ఆర్థిక సహాయం చేయడం జరుగుతుంది.

1957-58 సం॥ నుంచి కొత్తగూడెం, గూడూరులలో డిప్లొమా స్థాయివరకు విద్య గరపునట్టి మైనింగు ఇన్స్టి ట్యూట్స్ రెండు తెరువబడుతాయి.

సాంకేతిక విద్య కొరకు ఒక రాష్ట్రసంఘం (స్టేట్ బోర్డు) ప్రత్యేకంగా సాంకేతికవిద్యాశాఖ తెరువబడినాయి.

తెలంగాణాలో ఉన్నత పాఠశాల విద్యా సౌకర్యాలు లేని తాలూకా కేంద్రాలలో క్రొత్తగా 15 ప్రభుత్వోన్నత పాఠశాలలను ప్రణాళిక కాలంలో తెరుచుటకు ఉద్దేశింప బడింది.

అంధులు, బధిరుల పాఠశాలలు పునర్వ్యవస్థీకరించ బడుతాయి. ఒక స్టేడియం, బహిరంగ నాటకశాల నిర్మించ బడుతాయి. బీదవారైవుండి, చురుకైన విద్యార్థులకు రియా యతీ స్కాలర్‌షిప్పులు ఇచ్చుటకుకూడా కొంతడబ్బు కేటా యించబడింది.

వరంగలు పాలీటెక్నిక్‌లో మెకానికల్ ఎలెక్ట్రికల్ ఇంజ నీరింగు విభాగాలలో నేషనల్‌స్టాండర్డు సర్టిఫికెటుతో సమాన మైన డిప్లొమాకోర్సులు ప్రవేశపెట్టబడుతాయి. విస్తృతశిక్షణ సౌకర్యాలకై తయారుచేయబడిన పథకం ప్రకారం హైద్రా బాదులోని కేంద్రవృత్తిపనుల సంస్థలోను, నిజామాబాదులోని ప్రభుత్వ సాంకేతిక శిక్షణ కేంద్రంలోను అదనంగా వరు సగా 224 సీట్లు, 208 సీట్లు ఏర్పాటుచేయుటకు సంకల్పించ బడింది. ఇందుకై ఈ రెండు సంస్థలలో రెండవ షిఫ్టు ఏర్పాటుచేయబడుతుంది. వరంగలులోకూడా 152 సీట్లతో కొత్తగా ఒక సాంకేతిక శిక్షణ కేంద్రం తెరువబడుతుంది.

రెండవ ప్రణాళిక అంతమయ్యేనాటికి తెలంగాణాలో వున్న వివిధ సాంకేతిక శిక్షణ సంస్థలలో విద్యార్థుల సంఖ్య 910 కి పెంచబడుతుంది. ఉస్మానియా విశ్వకళాపరిషత్తులో అండర్ గ్రాడ్యుయేట్ కోర్సు, పోస్టు గ్రాడ్యుయేట్ రీసర్చి కోర్సులను అభివృద్ధిపరచుటకు డబ్బు కేటాయించబడింది.

## వైద్యం

రెండవ ప్రణాళిక కాలంలో ఆంధ్ర మెడికల్ కాలేజీకి కింగ్‌జార్జి ఆసుపత్రికి అదనంగా భవనములు నిర్మించబడు తాయి.

కర్నూలులోని జనరల్ ఆసుపత్రిలో మంచముల సంఖ్య 250 నుంచి 500 వరకు పెంచబడుతుంది, అదనంగా భవనములు నిర్మించబడుతాయి. కర్నూలు మెడికల్ కాలే జీలో సాలీనా 50 మంది విద్యార్థులు చేర్చుకోబడుతారు. క్లినికల్ తరగతులు నిర్వహించబడుతాయి. ఈ అభివృద్ధి పనులన్నీ 1958 నుంచి అమల్లోకి వస్తాయి.

అనంతపురంలో ఒక క్రొత్త ఆసుపత్రి నిర్మించబడు తుంది. కడపలోని జిల్లా ఆసుపత్రి అభివృద్ధి పరచబడు తుంది. ఏలూరు, మచిలీపట్నం, చిత్తూరు, కడపలోని జిల్లా ఆసుపత్రులలోని మంచములసంఖ్య పెంచబడుతుంది. విజయవాడ ఆసుపత్రిలో 100 మంచములు, అమలాపురంలో 28 మంచములుగల ఆసుపత్రులు నిర్మించడమేగాక తాలూకా కేంద్ర ఆసుపత్రులలో గూడా మంచములసంఖ్య హెచ్చించ బడుతుంది. తాలూకా కేంద్రాలలో గూడా క్షయ చికిత్సా లయాలు నెలకొల్పబడుతాయి.

ఈ ప్రణాళిక కాలంలోనే 29 పట్టణ ప్రాంతాలలో 117 గ్రామీణ ప్రాంతాలలోను కుటుంబ నియంత్రణ చికిత్సాల యాలు తెరువబడుతాయి. అంతేగాక 13 ఇ. యస్. టి., 13 నేత్ర వైద్య చికిత్సాలయాలుకూడా తెరువబడుతాయి. విశాఖపట్నం, గుంటూరు, తిరుపతి, భద్రాచలములలో నాలుగు అంటువ్యాధుల ఆసుపత్రులు నడిపించబడుతాయి.

హైద్రాబాదు నగరంలోని కేంద్ర పరిశోధనాలయాలకు అభివృద్ధి పరచుటకు సంకల్పించబడింది.

ఈ పథకాలన్నింటివల్ల ఆసుపత్రుల సంఖ్య 171 నుంచి 178 కి, మంచములసంఖ్య 4300 నుంచి 6000 వరకు హెచ్చి పోతుంది. మొదటి ప్రణాళికకాలంలో పట్టణ, గ్రామీణ, ప్రాంతాలలో వున్న 419 చిన్న ఆసుపత్రులు రెండవ ప్రణాళిక అంతంనాటికి 462 వరకు పెరిగిపోతాయి.

తెలంగాణాలో మహిళాకళాశాల ఆవరణలో 10 యెకరా లలో క్రొత్తగా ఉస్మానియా మెడికల్ కాలేజీని నిర్మించుట కును ఉస్మానియా జనరల్ ఆసుపత్రిని విస్తృత పరచుటకును తలపెట్టబడింది. గాంధీ మెడికల్ కాలేజీ నిర్మించబడు తుంది. కె. ఇ. యం. ఆసుపత్రి వైద్య విద్యార్థులకు బోధించుటకు వుపయోగపడునట్లుగా విస్తృతపరచబడు తుంది. రేడియం ఇన్స్టిట్యూట్‌లో మంచములసంఖ్య హెచ్చింపబడుతుంది. అందులో ఆధునికపరికరాలు అమర్చ బడుతాయి. ప్రస్తుతం వైద్యసౌకర్యాలు లేని రెవిన్యూ ఫిర్కాలలో సబ్సిడీ గ్రాంటుపైన మెడికల్ ప్రాక్టీషనర్లు నియమించబడుతారు. తాలూకా, జిల్లా ఆసుపత్రులు విస్తృత పరచబడుతాయి. వాటికి వలసిన పరికరములుకూడా సమ కూర్చ బడుతాయి. జిల్లా కేంద్ర ఆసుపత్రు లన్నింటిలో క్షయ చికిత్సాలయాలు నెలకొల్పబడుతాయి. అంతేగాక, అంటువ్యాధుల మంచముల ఏర్పాటుకూడా జరుగుతుంది. ఈపనులన్నీ రెండవప్రణాళికకాలంలో అమల్లోకి వస్తాయి.

ప్రణాళిక అంతం నాటికి ఆసుపత్రులసంఖ్య ఎక్కువ కానప్పటికీ మంచముల సంఖ్య 5080 నుంచి 6000 కు పెరుగుతుంది. పట్టణగ్రామీణ ప్రాంతాలలో ప్రస్తుతం 200 చిన్న ఆసుపత్రులు మాత్రమే వున్నాయి. అయితే ప్రణా ళిక ముగిసేసరికి ఈ సంఖ్య 320 కి పెరుగుతుంది.

రెండవప్రణాళిక కాలంలో 150 మంచములతో ఆయు ర్వేద ఆసుపత్రిని స్థాపించుటకు సంకల్పించబడింది.

## ప్రజారోగ్యం

ప్రస్తుతపు ఆరోగ్య సర్వీసులను పెంపొందించి, ప్రజా నీకానికంతటికీ అందుబాటులో వుండునట్లుచేయుట, జాతీయ ఆరోగ్యస్థాయిని హెచ్చించుట ప్రణాళిక లక్ష్య ములై వున్నవి.

ద్వితీయ ప్రణాళికలో ప్రజారోగ్యానికి సంబంధించిన 52 పథకములను — 38 ఆంధ్రలోను, 14 తెలంగాణా లోను — అమలు పరచుటకు తలపెట్టబడింది. ఇందులో ఆంధ్రప్రాంతపు వాటా రూ. 367.82 లక్షలు, తెలంగాణా వాటా రూ. 154.65 లక్షలు.

భారతదేశంలో మలేరియావ్యాధి ప్రజారోగ్యానికి సంబం ధించిన ముఖ్య వ్యాధి. అందుకనే దీనికి జాతీయ ప్రణా ళికలో అధిక ప్రాధాన్యం యివ్వబడింది. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో ఆంధ్ర మలేరియా కంట్రోలు కార్యక్రమం చాలా ముఖ్యమైన ఆరోగ్య కార్యక్రమాలలో ఒకటి. రెండవ ప్రణాళికలో కూడా మరొక రెండు కంట్రోలు యూనిట్లను నిర్వహించుటకు తలపెట్టబడింది.

ఈ పథకంవల్ల మలేరియాకు గురికాకుండా 40 లక్షల మందికి రక్షణ ఇవ్వబడుతుంది. నేషనల్ ఫైలేరియా కంట్రోల్ కార్యక్రమంక్రింద రెండవ ప్రణాళిక కాలంలో మరొక రెండు కంట్రోల్ యూనిట్లు పనిచేస్తాయి.

ప్రథమ ప్రణాళికలో మిగిలిపోయిన 15 పట్టణ నీటి సర ఫరా పథకములు, రెండు డ్రెయినేజి పథకములు ఈ ప్రణా ళికలో కూడా కొనసాగించబడతాయి. అంతేగాక క్రొత్తగా ప్రొద్దుటూరు నీటిఫరా అభివృద్ధి పథకం, ఏలూరు మురుగు నీటి పథకం అమలుపరచబడుతాయి.

రెండవ ప్రణాళికలో ఆంధ్రలో గ్రామీణ నీటిసరఫరా పథకం కొరకు రూ. 57.24 లక్షలు కేటాయించబడినవి.

తెలంగాణాలో 66 వైద్య, ఆరోగ్య యూనిట్లు తెరువ బడుతాయి. హైద్రాబాదు నగరంలోని ఫీవర్ ఆసుపత్రి ఎక్కువమంది రోగులను చేర్చుకొనుటకు అభివృద్ధిపరచ బడుతుంది. నిజామాబాదు, మహబూబునగరు, మెదకు, కరీంనగరు జిల్లాలలో ఫిలేరియాసిస్ వ్యాధిని అదుపులో వుంచుటకు 3 కంట్రోలు, ఒక సర్వే యూనిట్లను నెల కొల్పుటకు సంకల్పించబడింది. ప్రణాళిక కాలంలో వెనుక బడిన ప్రాంతాలలో 6 ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రాలు స్థాపించబడుతాయి. స్కూలు చికిత్సాలయాలు నెలకొల్ప బడుతాయి. ప్రతి జిల్లా కేంద్రంలో వైద్యాధికారులు నియ మించబడుతారు. కేవలం జిల్లా, తాలూకా, గ్రామాలలో పిల్లల ఆరోగ్యాన్ని పరిశీలించి వారికి చికిత్స చేయడమే వీరి విధి. వరంగల్లులోను, నిజామాబాదులోను ఒక్కొక్క కుటుంబ నియంత్రణ చికిత్సాలయాన్ని తెరుచుటకు సంక ల్పించబడింది.

జాతీయ నీటి సరఫరా, పారిశుద్ధ్య కార్యక్రమంక్రింద కర్నూలు, గద్వాలల్లో రెండు పథకములు కొనసాగించబడు తాయి. ఈ పథకములు ప్రథమ ప్రణాళికలో చేపట్టబడినవే. క్రొత్తపథకములుకూడా ఆరంభించబడుతాయి.

## గృహనిర్మాణం

రెండవ ప్రణాళిక కాలంలో వివిధ గృహనిర్మాణ పథ కములను అమలుపరచుటకుగాను రూ. 516.27 లక్షలు కేటాయించబడినవి. అందులో ఆంధ్ర వాటా రూ. 190.24 లక్షలు, తెలంగాణా వాటా రూ. 326.03 లక్షలు.

ఆంధ్ర రెండవ ప్రణాళికలో మురికిపేటల నిర్మూలనకు రూ. 11.40 లక్షలు, ఊడ్చువారి గృహనిర్మాణ పథకము నకు రూ. 17.22 లక్షలు కేటాయించబడినవి. ఆంధ్రలో 15 మునిసిపాలిటీలు మురికిపేటల నిర్మూలనకు పూనుకొని అభివృద్ధి పథకములను అమలుపరుస్తాయి. తెలంగాణాకు రూ. 50.41 లక్షలు కేటాయించబడినవి. ప్రణాళిక కాల ములో 75 ఎకరాల ప్రాంతంలో చెత్త చెదారములను లేకుండా ఊడ్చువారికి 1500 ఇండ్లు నిర్మించుటకు తలపెట్ట బడింది.

## కార్మిక సంక్షేమం

కార్మికులకు సంబంధించిన పథకములకు రు. 71.06 లక్షలు ఖర్చుపెట్టబడుతుంది. ఇందులో ఆంధ్ర వాటా 47.54 లక్షలు, తెలంగాణా వాటా 23.52 లక్షలు.

ఆంధ్ర ప్రాంతంలో అనంతపురంలోని సబ్ రీజినల్ ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజిని అభివృద్ధి పరచడమే గాకుండా శ్రీకాకుళంలో జిల్లా ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ ఛేంజీని తెరుచుటకు తలపెట్టబడింది. తెలంగాణాలో 7 జిల్లా ఎంప్లాయిమెంట్ ఎక్స్ ఛేంజీలు తెరువబడుతాయి. అంతే గాకుండా రీజినల్ డైరక్టరేట్, హైదాబాదు వరంగలులలోని రీజినల్ ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజీలను అఖిల భారత సంస్థతోపాటు కలిపివేయుటకు సంకల్పించబడింది. హైదా బాదు, రాజమండ్రీలలో రీజనల్ ఎంప్లాయిమెంటు ఎక్స్ ఛేంజీలలో రెండు యూత్ ఎంప్లాయ్‌మెంటు సర్వీసు. నౌకరీ సలహా యూనిట్లు స్థాపించబడుతాయి.

సికింద్రాబాదులోని కే. ఇ. యం. ఆసుపత్రిలోను, ఎర్రం నుమాలోని క్షయ ఆసుపత్రిలో ఇన్సూరు చేసిన కార్మికుల కొరకు మాత్రమే ప్రత్యేకంగా ఒక వార్డును నెలకొల్పు టకు సంకల్పించబడింది.

## వెనుకబడిన తరగతులవారి సంక్షేమం

వెనుకబడిన తరగతులలో, నిమ్నజాతులు, మాజీ నేరస్థజాతుల ప్రజల సంక్షేమం కొరకై రెండవ పంచవర్ష ప్రణాళికలో మొత్తం రూ. 200.43 లక్షలు కేటాయించ బడినవి. (ఆంధ్ర) తాలూకు రూ. 152.13 లక్షలు, తెలం గాణా తాలూకు 48.30 లక్షలు) రాకపోకల సౌకర్యాలను అభివృద్ధి పరచుట, వైద్య ప్రజారోగ్య సౌకర్యాలు కల్పిం చుట, దేశ ద్రిమ్మరులగు గిరిజనులకు స్థిరనివాసం ఏర్పరు చుట, విద్య, నీటిసరఫరా, గృహనిర్మాణం మున్నగు వాటికి చెందిన పథకములు అమలు పరుచబడుతాయి.

గిరిజనుల సంక్షేమ పథకాలు, వారి సంస్కృతి, సాంప్ర దాయాల పోషణకు అనుగుణంగా తయారుచేయబడుతాయి. నిమ్నజాతుల ప్రజలకు అస్పృశ్యతానివారణ, సాంఘిక అత్యాచారాలను తొలగించు పథకములపై శ్రద్ధ వహించ బడుతుంది. ఆర్థిక సహాయం కల్పించుటకు, విద్యార్థి ఉప కార వేతనములు, స్టయిపండులు ఇవ్వడంద్వారా విద్యా సౌకర్యాలను పెంపొందించుట మున్నగు పథకములద్వారా వీరి స్థితిగతులు బాగుపరచబడుతాయి. రెండవ ప్రణాళిక కాలంలో వెనుకబడిన తరగతులకు చెందినవారికి ఇంకా యెక్కువగా విద్యార్థి ఉపకార వేతనాలు ఇచ్చుటకు తల పెట్టబడింది.

## మునిసిపల్ రోడ్లు, అభివృద్ధి పనులు

ఆంధ్రలోమునిసిపల్‌రోడ్లు, ఇతరఅభివృద్ధిపనులకొరకై రెండవ ప్రణాళికలో రూ. 47.54 లక్షలు కేటాయించబడి నది. ప్రభుత్వ మిచ్చే ధన సహాయంతో పంచాయితీలు, మునిసిపాలిటీలు 30 మార్కెట్లను నిర్మించి, అభివృద్ధి చేయగలవనీ, 3 హైస్కూలు భవనములను, 4 బావులు చెరువులను, 1 థియేటర్‌ను, 3 ఎలిమెంటరీ స్కూలు భవ నములను, 2 ప్రసూతి శిశు సంక్షేమ కేంద్రములను, 1 స్టేడి యంను, 14 గ్రామరోడ్లను నిర్మించగలవని తలపెట్టబడు తున్నది.

## రేడియోప్రసారం

రాష్ట్ర ప్రణాళికలో 6200 కమ్యూనిటీ రేడియో సెట్టుల స్థాపన నిర్వహణకు ఏర్పాటు చేయబడింది. ఆంధ్రలో 5000, తెలంగాణాలో 1200 కమ్యూనిటీ రేడియోసెట్టు లుంటాయి. వీటికయ్యే ఖర్చు వరుసగా రూ. 50.34 లక్షలు, 11.86 లక్షలు. [తరువాయి 28 వ పేజీలో]

# రాష్ట్రంలో పారిశ్రామికోత్పత్తి



ఆంధ్రప్రదేశ్‌లోని భారీ, మధ్యరకం, చిన్న పరిశ్రమలలో 1957 ఆగస్టునెలలో ఉత్పత్తి బాగా జరిగింది. ఈ నెలలో పరిశ్రమలకు ప్రభుత్వసహాయ చట్టము ననుసరించి దాదాపు 50 వేల రూపాయలు పంపిణీ చేయబడ్డవి. ఆంధ్రప్రాంతంలో సామాజికాభివృద్ధి బ్లాకులక్రింద ఏర్పాటు చేయబడ్డ శిక్షణ కార్యక్రమంద్వారా, తెలంగాణా ప్రాంతంలో గ్రామీణ కళలు, చేతిపనులు, పరిశ్రమల కేంద్రాల ద్వారా జరుగుతూవున్న పని సంతృప్తికరంగా వుంది. సామాజికాభివృద్ధి బ్లాకులలో ఆగస్టు నెలాఖరువరకు అప్పులు పంపిణీ చేయబడ్డవి. ఇందువల్ల చేతిపనులవారు స్వంతంగా పరిశ్రమను పెట్టుకొని ఆర్జించుకోవడానికి వీలు కలుగుతుంది.

విశాఖపట్నం హిందూస్తాన్ నౌకా నిర్మాణశాలలో 7000 టన్నుల మోటారు కార్గో నౌక నిర్మాణం పూర్తిఅయింది. ఇటువంటిదే మరొక నౌక నిర్మాణంకూడా చేపట్టబడింది. లోగడ నిర్మాణంలో వున్న నౌకలకు బెర్తులను ఏర్పాటు చేసేపని చురుకుగా జరుగుతున్నది. దేశమంతటికీ ప్రధానమైన ఈ నౌకా నిర్మాణశాలను విస్తృతీకరించే కార్యక్రమం సంతృప్తికరంగా అమలు జరుగుతున్నది.

## భారీ పరిశ్రమలు

రాష్ట్రంలోని జనపనార మిల్లులు ఈ నెలలో 382 టన్నుల జనపనారత్రాడును, 1483 టన్నుల గోనెసంచులను, 304 టన్నుల నారపట్టాను తయారు చేశాయి. ఇతర ఉత్పత్తులు ఇవి: సిమెంటు 14,600 టన్నులు; కాగితం 99 టన్నులు; వేరుసెనగనూనె 170 టన్నులు.

వరంగలు, పందలపాక, అదోని వస్త్రపు మిల్లులలో దాదాపు 20 లక్షల గజాల వస్త్రం, 9 లక్షల పౌనుల నూలు తయారైనవి. రాయనగర్ లోని రాయలసీమమిల్లు 585 బేళ్ళ నూలు తయారు చేసింది.

సిర్పూరులోని సిర్ సిల్కు లిమిటెడ్ కంపెనీ దాదాపు మూడులక్షల పౌనుల నూలును, నాలుగు లక్షల గజాల సిల్కువస్త్రమును తయారు చేసింది.

## గనులు

కృష్ణాజిల్లాలోని గనులనుంచి 6781 టన్నుల ముడిఇనుము తీయబడింది. గరివిడి గనులనుంచి రూ. 14,27,597 ల విలువచేసే మాంగనీసు తీయబడింది.

## మధ్యరకపు పరిశ్రమలు

గూడూరులోని ప్రభుత్వ పింగాణీ ఫ్యాక్టరీలో రూ. 23,684 ల విలువగల పింగాణీ పాత్ర సామాను, శానిటరీ సామగ్రి తయారైంది. రాజమండ్రిలోని ప్రభుత్వ పింగాణీ సర్వీసుకేంద్రం రూ. 1,800 ల విలువగల ముడిసరుకును తయారు చేసింది. ఈ నెలలో ఇంకా రూ. 16,650-ల విలువగల సిమెంటుసరుకులు, 1,868 పౌనుల చందనపుతైలము తయారు చేయబడ్డవి.

తెనాలిలోని ఫౌంటెన్ కలముల ఫ్యాక్టరీ 35 గ్రోసుల కలములను తయారుచేసింది. విశాఖపట్నంలోని జనరల్ ఇంజనీరింగు అండ్ సైంటిఫిక్ కంపెనీ ఈ నెలలో రూ. 3,925 ల విలువగల శాస్త్రీయ పరికరాలను తయారు చేసింది. విజయవాడలోని సౌతిండియన్ రీసెర్చి ఇన్‌స్టిట్యూటు రూ 67,055 ల విలువగల మందులను తయారుచేసింది. ఆంధ్ర ఫార్మస్యూటికల్ వర్క్సువారు రూ 10,728 ల విలువగల మందులు తయారుచేశారు. చిత్తూరులోని న్యూట్రీన్ కన్‌ఫెక్షనరీ కంపెనీ లిమిటెడ్‌వారు ఈ నెలలో 78 టన్నుల మిఠాయిసరుకు తయారు చేశారు.

## చిన్న పరిశ్రమలు

కేంద్ర సాంఘిక సంక్షేమబోర్డు వారి పథకము ననుసరించి విజయవాడలో ప్రారంభింపబడిన అగ్గి

పెట్టెల ఫ్యాక్టరీ 2,500 గ్రోసుల అగ్గిపెట్టెలు తయారుచేసింది. విశాఖపట్నం జిల్లాలోని రెండు అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలు 1256 గ్రోసులు తయారు చేశాయి. ఆసిఫ్‌నగర్ ఫేమిలీవెల్ఫేర్ మ్యాచ్ ఇండస్ట్రియల్ కో ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్ హైద్రాబాదువారు 9698 గ్రోసులు తయారు చేశారు. హైద్రాబాదులోని ముషీరాబాదు మ్యాచ్ ఇండస్ట్రియల్ కో ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్ వారు 8,757 గ్రోసులు తయారుచేశారు.

విజయవాడలోని నమూనా చర్మ సామగ్రి తయారీకేంద్రం ఈ నెలలో రూ. 2000 ల విలువ గల సామగ్రి తయారు చేసింది.

## కుటీర పరిశ్రమలు

ఏటి కొప్పాకలో కర్ర, లక్కబొమ్మల ఉత్పత్తి ఈ నెలలో యథాప్రకారం జరిగింది. కొండపల్లి బొమ్మల తయారీ సంఘంవారు రూ. 1,122 ల విలువచేసే బొమ్మలు తయారు చేశారు. తిరుచానూరులోని బొమ్మల తయారీ - శిక్షణకేంద్రం ఈ నెలలో రూ. 344ల విలువచేసే బొమ్మలు తయారు చేసింది. రామవరప్పాడులోని అచ్చుపోత పని ఉత్పత్తి శిక్షణ కేంద్రం రూ. 727 ల విలువగల సరుకును తయారు చేసింది. విశాఖపట్నపు దంత పరిశ్రమ రూ . 2,147 ల విలువగల వస్తువులను తయారు చేసింది. వరంగలులోని కుటీర స్వల్ప పరిశ్రమల సహకార సంఘం రూ. 3,123 ల విలువగల తివాచీలను తయారు చేసింది.

## పట్టు పరిశ్రమ

పట్టు పరిశ్రమ అభివృద్ధికై ప్రభుత్వం మూడు పథకాలకు మంజూరీ ఇచ్చింది. (1) భిక్నూరులో రూ. 57,252 ల ఖర్చుతో ఒక క్షేత్రమును నెలకొల్పడం (2) మానేరులోని ప్రభుత్వ పట్టుక్షేత్రాన్ని రూ. 36,604 ల ఖర్చుతో అభివృద్ధి పరచుట (3) మానేరులో రూ. 18,000 ల ఖర్చుతో మల్బరీ మొక్కల పెంపకపు కేంద్రాన్ని స్థాపించడం. ఈ మూడు పథకాలను త్వరగా అమలు జరుపడానికి తగు చర్యలు గైకొనబడుతున్నవి.

ఈ నెలలో టస్సార్ పరిశ్రమ క్రమానుగతిని వృద్ధి చెందుతూ వచ్చింది. మహబూబ్‌నగర్ జిల్లా షాద్‌నగర్‌లో ప్రయోగాత్మకంగా ఒక పట్టు పరిశ్రమ కేంద్రాన్ని నెలకొల్పడానికై ప్రాథమిక చర్యలు గైకొనబడుతున్నవి.

## చేనేత పరిశ్రమ

కరీంనగర్ జిల్లా రుద్రవరంలో 110 మంది సభ్యులతో నూలు నేతపనివారల సహకార సంఘం ఏర్పాటు చేయబడింది. దీనితో నూలు నేతపనివారల సంఘాలసంఖ్య 121 అయింది. ఈ నెలలో అదనంగా మరి నాలుగు విక్రయశాలలు తెరువబడ్డవి. ఈ నెలలో నూలు నేతపనివారల సహకార సంఘాలు 19.25 లక్షల గజాల వస్త్రమును ఉత్పత్తిచేశాయి. 17.50 లక్షలగజాల వస్త్రమును అమ్మినవి. ఈ నెలలో రాష్ట్రం మొత్తంపై 26,909 మగ్గాలు రిజిస్టరైనవి.

విజయవాడలోని కేంద్ర విక్రయశాల ఈ నెలలో రూ. 2,214 ల కొనుగోలును, రూ. 3,081 ల అమ్మకమును జరిపింది.

---

## ఆంధ్రప్రదేశ్ రెండవ పంచవర్ష ప్రణాళిక

[26 వ పేజీ తరువాయి]

"మన ప్రయాణంలో ఒకదశ పూర్తిచేసినాము. అయితే రెండోదశవైపు మనం వెంటనే పురోగమించాలి. జీవిత మేవిధంగా నిరవధికమైన ప్రవాహమో, అదేవిధంగా జాతి జీవిత గమనాన్ని క్రమబద్ధం చేస్తున్న ప్లానింగ్ మరియు డెవలప్‌మెంటుకూడా నిరవధికమైనవే. కనుక మన ప్రయాణంలో మజిలీలంటూ లేవు."

— *జవహరలాలు నెహ్రూ.*





లేపాక్షి బసవయ్య

ఆంధ్రప్రదేశ్ జిల్లాలు :

# అనంతపురం

ఆంధ్రప్రదేశ్ జిల్లాలలో అనంతపురం ఒకటి. ఈ జిల్లా ఎల్లలు ఇవి. ఉత్తరమున కర్నూలు. దక్షిణమున పడమర మైసూరు రాష్ట్రప్రాంతం, బళ్ళారి; తూర్పున కడప. అనంతపురంజిల్లా విస్తీర్ణం 6706 చదరపుమైళ్ళు. జనాభా 1951 జనాభా లెక్కలను బట్టి 1,361, 556. ప్రజలు మాట్లాడే భాషలు: తెలుగు, కన్నడము.

తక్కువ వర్షపాతం, చెట్లుచేమలేకపోవడం, సారరహితమైన భూములు, నేలలో తేమలేకపోవడం ఇవి ఈ జిల్లా ప్రత్యేకతలు. గుత్తికొండపై ప్రసిద్ధ మరాటా సర్దారు మురారీరావు కోటవున్నది. పమిడి అద్దకం బట్టలకు పేరుపడ్డస్థలం. గుంతకల్లు ముఖ్యమైన రైల్వే జంక్షను, చేనేత కేంద్రంకూడా. తాడిపత్రి మునిసిపాలిటీ గల వూరు. ఇది యాత్రాస్థలం.

ప్రత్తిని వత్తి బేళ్ళుకట్టే కార్ఖానాలిక్కడ వున్నవి. బెలుగుప్ప నాణ్యామైన కంబళ్ళకు ప్రసిద్ధి జెందినది. ధర్మవరము సిల్కుబట్టకూ చీరెలకూ పేరుపడిన గ్రామం. పెనుకొండలో ప్రాచీన దుర్గమొకటి వున్నది. ఇది మహమ్మదీయులకు పుణ్యస్థలం. ఇక్కడ బాబయ్య ఫకీరుగారి దర్గావుంది. హిందూపురానికి మునిసిపాలిటీ వుంది. మంచి వర్తకకేంద్రం కూడా. కదిరిలో శ్రీ నరసింహస్వామి ఆలయం వున్నది.

రాష్ట్రంలోకల్ల ఈ జిల్లాలో వర్షపాతం తక్కువ. నీటిఎద్దడి బాగా వుంటుంది. వ్యవసాయ స్థితిగతులు బాగావుండవు. జిల్లాలోని మొత్తం తొమ్మిది తాలూకాలలోను మడకసిర, హిందూపురం తాలూకాలు మాత్రమే చల్లగా వుంటాయి.

జిలాఅంతటా వర్షపాతం ఒకేవిధంగా వుండదు. ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు నెలలో వర్షము ఎక్కువగా కురుస్తుంది. సగటు వర్షపాతం 21.48 అంగుళాలు.

ఈ జిల్లాలో వరినాట్లు వేయడం అరుదు. వడ్ల విత్తనాలు పొలాల్లో చల్లేస్తారు. అదే పైరుఅవుతుంది. వరి, జొన్న, సజ్జ, కొర్ర, రాగులు ముఖ్యమైన పంటలు. వాణిజ్య పంటలలో ఆముదాలు, ప్రత్తి, వేరుసెనగ చెప్పుకోదగినవి.

దాదాపు నూటికి 75 మంది వ్యవసాయంపై జీవిస్తారు. అసలు పనివారలు 39 శతి వుంటారు. మొత్తం జనాభాలో చేనేత పనివారు నూటికి 2 వంతులమంది వుంటారు. పారిశ్రామిక వ్యాపార జనాభా 16 శతి. గ్రామీణ పరిశ్రమలు చాలా తక్కువ. చాలా తాలూకాలలో మొద్దురకం కంబళ్ళు నేస్తారు. కాని కళ్యాణదుర్గం తాలూకాలోని కరిగుణపల్లి, బెలుగుప్ప కంబళ్ళు నాణ్యామైనవి. ధర్మవరం సిల్కుబట్టకు పేరుపడ్డది. పమిడిలో రంగు బట్టలు తయారవుతాయి. అనేకచోట్ల గాజులు తయారుచేసే కేంద్రాలున్నవి.

ఈజిల్లాలో మంచిరోడ్లు, రైలుమార్గాలు వున్నవి. కళ్యాణదుర్గం, మడకశిర తాలూకాలు తప్ప మిగతా అన్ని తాలూకాలలో రైలుమార్గమున్నది. కళ్యాణదుర్గం అనంతపురానికి 36 మైళ్ళ దూరంలో రోడ్డు మార్గంపై వున్నది. మడకశిర హిందూపురం రైలు స్టేషన్‌నుంచి 20 మైళ్ళ దూరంలో వున్నది.

జిల్లా ప్రధానకేంద్రం అనంతపురం. జిల్లాలో ముఖ్యమైన పట్టణాల జనాభా వివరాలు ఇవి: అనంతపురం మునిసిపాలిటీ 31,952; గుంతకల్లు 31,341, హిందూపురం 24,482; కదిరి పంచాయితీ 20 354; తాడిపత్రి 19,869; ఉరవకొండ 16,662; గుత్తి 15,487; ధర్మవరం 14,708; బుక్కపట్నం 11,224; కళ్యాణదుర్గం 8,163; యడికి 7,994; పెనుకొండ 6,880; మడకశిర 6,566; పమిడి 6,473.



లేపాక్షి శిల్పసంపద



లేపాక్షి : ఒక్కొక్కస్తంభం ఒక్కొక్క ఉజ్జ్వలగ్రంథం

## చూడదగిన స్థలాలు

**పెనుకొండ తాలూకా :**

పెనుకొండలో విజయనగరరాజులు కట్టించిన కోటవున్నది. ఆ కోటలోని "గంగామహల్" వేసవి కేంద్రం. దీనికి పురావస్తు ప్రాముఖ్యంకూడా కలదు. దక్షిణభారత ముస్లిములకు పెనుకొండ యాత్రా స్థలం. ఇక్కడ ప్రసిద్ధ ముస్లింసాధువు బాబయ్యాగారి దర్గావుంది. హజరత్ బాబా ఫక్రుద్దీన్. ఇక్కడే

సమాధి చేయబడినారు. ప్రతి సంవత్సరం జనవరి, ఫిబ్రవరి నెలల్లో ఉరుసు జరుగుతుంది. ఆ ఉర్సుకు దాదాపు పదివేలమంది జనం వస్తారు. విజయనగర సామ్రాజ్యాధిపతి శ్రీకృష్ణదేవరాయల హయాంలో నిర్మింపబడ్డ ఈశ్వరాలయం, రామాలయం, జైన దేవాలయాలు మతప్రాముఖ్యం గలవి. బీజాపూరు బహమనీ సుల్తానులు కోటలో కట్టించిన జామా మసీదు, షేర్ ఖాన్ మసీదులు ఈ సందర్భంలో ప్రత్యేకంగా చెప్పుకోదగినవి.

దక్షిణరైల్వేలో గుంటకల్ - బెంగుళూరు మార్గంపై పెనుకొండ వున్నది. ఇక్కడనుంచి జిల్లా ప్రధానకేంద్రానికీ, ఇతర తాలూకా కేంద్రాలకూ, ఫిర్కాలకు రోడ్లు వున్నవి. ఇక్కడినుంచి జిల్లా ప్రధానకేంద్రం 47 మైళ్ళు. ఇక్కడ ఒక ట్రావెలర్స్ బంగళా వుంది. అది పబ్లికువర్క్సు డిపార్టుమెంటు వారి అజమాయిషీలో వుంది.

*గుత్తి తాలూకా*

గుత్తికొండపై మరాటా సర్దారు మురారిరావు కట్టించిన కోట చారిత్రక ప్రాముఖ్యం గలది. ఇది ఇప్పుడు రక్షిత చారిత్రక కట్టడము. ఈ కోట, సర్ థామస్ మన్రో సత్రం గుత్తిలో చారిత్రకస్థలాలు. పబ్లికువర్క్సు శాఖవారి అజమాయిషీక్రింద ఇక్కడ ఒక ఇనస్పెక్షన్ బంగళా వుంది. గుత్తికెళ్ళినవారు సర్ థామస్ మన్రో సత్రంలోకూడా బసచేయవచ్చు. ఈ సత్రం ఇప్పుడు అనంతపురం జిల్లాబోర్డువారి అజమాయిషీలో వుంది. దాని మేనేజిమెంటును గుత్తి పంచాయితీ బోర్డువారికి మార్పుచేసే ప్రతిపాదన ఒకటి వున్నది. బొంబాయి-మద్రాసు రైలుమార్గంపై గుత్తి ముఖ్యమైన రైలుస్టేషను.

గుత్తినుంచి జిల్లాకేంద్రానికీ, ఇతర తాలూకా కేంద్రాలకూ, ఫిర్కాలకూ రోడ్లు వున్నవి. గుత్తి నుంచి రైలుమీద గుంతకల్లుగుండా పోతే అనంతపురం 62 మైళ్ళ దూరంలో వుంటుంది. అనంతపూరు-కర్నూలు రోడ్డుపైగాపోతే గుత్తికి అనంతపురానికి దూరం 32 మైళ్లు.

గుత్తి తాలూకాలో వజ్రకరూరులో వజ్రాలు లభిస్తాయి.

*హిందూపురం తాలూకా :*

హిందూపురం తాలూకాలో లేపాక్షి ఆలయం కుడ్య వర్ణ చిత్రాలకు ప్రసిద్ధి చెందినది. ఈ ఆలయంలోని నందికూడా చూడదగివున్నది. కళాభిమానులకు లేపాక్షి నిజంగా యాత్రాస్థలం. యేటా అనేక మంది ఇచటికివచ్చి ఇక్కడి వర్ణచిత్రాలను శిల్పాలనూ చూస్తూవుంటారు. హిందూపురంనుంచి లేపాక్షి 10 మైళ్ళ దూరంలో వుంది. బస్సుసర్వీసు వున్నది. హిందూపురానికీ, అనంతపురానికీ దూరం రోడ్డు ద్వారా 60 మైళ్ళు, రైలుద్వారా 70 మైళ్లు.

*తాడిపత్రి తాలూకా :*

శ్రీ చింతల వెంకటరమణస్వామి ఆలయం శిల్ప విన్యాణానికి పేర్వడసినది. ఇది విజయనగర సామ్రాజ్య స్థాపకులైన హరిహర బుక్కరాయల కాలంలో నిర్మింపబడింది. ఆలయ కుడ్యములపై చెక్కబడిన విగ్రహాలు విజయనగర శిల్పకళకు తార్కాణాలు. రామాయణంకథ యావత్తు, భాగవత పురాణంలోని కొన్నికథలు ఈ ఆలయ చెక్కడాలలో చిత్రింపబడ్డవి.

వైష్ణవుల ఆగమశాస్త్రం ప్రకారం ఈ ఆలయం సర్వలక్షణ సమన్వితమైనది. ఆలయ ప్రధానద్వారాని కెదురుగా చక్కని రాతిరథం వున్నది. ఆ రథంలో గరుడాళ్వారు ప్రతిష్ఠింపబడి వున్నాడు. ఉత్తరాయణంలోనూ, దక్షిణాయనంలోనూ కొన్ని రోజులలో బాలభానుని బంగారుకిరణాలు రాతిరథ కుడ్యముల గుండా చొచ్చుకొనిపోయి గరుడాళ్వార్ పాదములపై బడి ప్రకాశిస్తవి.

శ్రీ రామలింగేశ్వరాలయం విజయనగర సామ్రాజ్యాధిపతి శ్రీ ప్రౌఢదేవరాయల కాలంలో నిర్మింపబడింది. ఇది పెన్నానదికి దక్షిణపుఒడ్డున వున్నది. ఉత్తరపువైపు గోపురం అసంపూర్ణంగానే వుండిపోయింది. దక్షిణపు గోపురం పడిపోయింది. కళాప్రియులకు ఈ ఆలయ శిల్పం నేత్రోత్సవం గొల్పుతుంది. ఈ ఆలయంలోపల శ్రీరామాలయంకూడా వుంది. తాడిపత్రిలో పబ్లికువర్క్సు శాఖవారి ఇన్‌స్పెక్షన్ బంగళా వుంది. తాడిపత్రిలో హోటళ్ళు వున్నవి. అయితే హాటిలో బసచేయడానికి వీలుండదు.

తాడిపత్రి మద్రాసు-బొంబాయి బ్రాడ్‌గేజి రైలుమార్గంపై వున్నది. తాడిపత్రినుంచి అనంతపురానికి రోడ్డువుంది. దూరం 38 మైళ్ళు.

*కదిరి తాలూకా :*

కదిరిలోని శ్రీనరసింహస్వామి ఆలయం మత ప్రాముఖ్యం కలది. ఇది దక్షిణభారతంలోనే సుప్రసిద్ధమైనది. ప్రతియేటా మార్చినెల మూడోవారంలో లక్ష్మీనరసింహస్వామి రథోత్సవం జరుగుతుంది. అప్పుడు వేలకొలది జనం వస్తారు. హరిజనులకు దేవాలయ ప్రవేశ చట్టం ఆమోదింపబడక పూర్వమే హరిజనులు మొదట మద్దులేరులో స్నానంచేసి తరువాత ఈ దేవాలయంలోకి ప్రవేశించేవారట. ఈ ఆచారం చాలా రోజులబట్టి వున్నది. కదిరి తాలూకా కాటూరుపల్లి గ్రామంలో ప్రసిద్ధ తెలుగుకవి వేమన సమాధిపై దేవళం నిర్మింపబడింది. సూలిబైలు గ్రామం మర్రిచెట్టు ప్రత్యేకంగా చెప్పుకోదగింది. ఇది చాలా పురాతనమైంది. ఒకప్పుడు మర్రిచెట్టు అసలు మొదలు వుండినచోట తిమ్మమ్మ గుడి అని చిన్న ఆలయం వున్నది. దాదాపు 200 ఏండ్లక్రింపట తిమ్మమ్మ అనే ఒక స్త్రీ సతీసహగమనం చేసిందట. ఆమె సహగమనం చేసినచోట మర్రిచెట్టు మొలిచిందట. ఈ గ్రామం తాలూకా కేంద్రానికి 16 మైళ్ళ దూరంలో వుంది.

కదిరిలో పబ్లికువర్క్సు శాఖవారి ఇన్‌స్పెక్షన్ బంగళా వుంది. దానిపై అజమాయిషీ అనంతపురం జిల్లా కలెక్టరుది. ఇక్కడ భోజనవసతి లేదు. ఇక్కడికి జిల్లా కేంద్రానికి రైలూ వుంది, బస్సుసౌకర్యమూ వుంది. రోడ్డుద్వారా వెళితే దూరం 48 మైళ్ళు.

కదిరికీ ధర్మవరానికి రైలు సౌకర్యం వుంది. ధర్మవరం దక్షిణ రైల్వేలో అనంతపురం-బెంగుళూరు రైలుమార్గంలో వుంది. అనంతపురంనుంచి వొచ్చే ప్రయాణీకులు కదిరి సందర్శిస్తారు.

"అలూరు కోన" అందమైన లోయప్రదేశం. ఇక్కడ సంవత్సరమంతటా ప్రవహించే సెలయేళ్ళు, చిన్న జలపాతమూ చూడదగినవి. ఇక్కడ శ్రీరంగనాయకస్వామి ఆలయంకూడా కలదు. ఆలయానికి తూర్పున వున్న లోయ దృశ్యం చూడదగింది. సహజమైన ఆ జలపాతం, స్వచ్ఛమైన దాని నీరు ఎంతో బాగా వుంటాయి. ఇది తాడిపత్రికి 5 మైళ్ళ దూరంలో వుంది. తాడిపత్రిలో ట్రావెలర్స్ బంగళా వుంది.

అలూరుకోనలో హోటళ్ళు లేవు. అక్కడికి బస్సు సౌకర్యం కూడా లేదు.



# పాఠ్యపుస్తకాల జాతీయకరణ

1954 లో వెలువడిన కుప్పుస్వామి కమిటీ నివేదికను ఆధారంగా చేసుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ దిగువ నిర్ణయంచేసింది :-

1. పాఠ్యపుస్తకాల జాతీయకరణ పథకం 1958-59 విద్యా సంవత్సరంనుంచి అమలు జరుపబడుతుంది. అంటే స్కూలుపిల్లలకు కావలసిన పుస్తకాలు 1958 మే 1 వ తేదీ వరకల్లా లభింపజేయబడాలి.

2. మొదట 1 వ తరగతి మొదలు 5 వ తరగతి వరకు తెలుగుభాషలోనూ, బోధనాభాషలోనూ అవసరమైన పుస్తకాలనుమాత్రమే ప్రభుత్వం తయారుచేయిస్తుంది. ఆ తరువాత క్రమేణా జాతీయకరణ పథకం 6 మొదలు 8 వ తరగతి వరకూ, తరువాత సెకండరీ పాఠశాలల స్థాయివరకూ విస్తరింప చేయబడుతుంది.

3. ఆయా విశ్వవిద్యాలయాల ప్రాంతాలను బట్టి మొత్తం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మూడు మండలాలుగా విభజింపబడుతుంది. అనగా ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రాంతమైన సర్కారు జిల్లాలు ఒకమండలం, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాంతమైన రాయలసీమ నెల్లూరు జిల్లాలు రెండవ మండలం, ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రాంతమైన తెలంగాణా మూడో మండలంగా విభజింపబడుతాయి.

4. భాషలకు మూడుపుస్తకాలు నిర్ణయింపబడుతాయి. అంటే ఒక్కొక్క విశ్వవిద్యాలయప్రాంతానికి ఒక పుస్తకమన్నమాట. కాని ఏదేని విషయానికి సంబంధించిన పుస్తకాలవిషయంలో మూడు విశ్వవిద్యాలయ ప్రాంతాలకూ ఒక్కపుస్తకమేచాలు. ఈ పుస్తకాలు మూడేండ్ల గడువువరకు నిర్ణయింపబడుతాయి . భాషకు సంబంధించిన పుస్తకాలు మాత్రమే ప్రతియేటా మారుతూ వుంటాయి.

5. పాఠ్యపుస్తకాల ముద్రణ కర్నూలుకు బదులుగా హైద్రాబాదులోని ప్రభుత్వ ముద్రణాలయంలో ముద్రించవలెను. ఇప్పుడు అమలులో వున్నవాటికంటె ఉత్తమమైన పాఠ్యపుస్తకాలను తయారుచేయించాలి. అంటే విషయం, నాణ్యం, ముద్రణ, గెటప్ బాగా వుండవలెను. బొమ్మలుకూడా చక్కగా వుండవలెను.

6. పుస్తకాల ముద్రణకు అవసరమైన ముద్రణ యంత్రాలను దాదాపు రూ. 6 లక్షల ఖర్చుతో 1957 డిసెంబరువరకల్లా వాణిజ్యపరిశ్రమలశాఖ కొనవలెను. ఆ సమయానికి ముద్రించవలసిన పాఠ్య పుస్తకాల లిఖితప్రతులు సిద్ధంగా వుండవలెను.

లిఖిత ప్రతులను తయారుచేయడానికి, అంటే కొత్తగా పుస్తకాలు వ్రాయడానికీ, కొన్నిసందర్భాలలో పాఠములను కూర్పుచేయడానికీ రాష్ట్రం మొత్తంలో 1 వ తరగతి మొదలు 5 వ తరగతివరకు నిర్ణీత పాఠ్యవిషయాలనుబట్టి అనేక కమిటీలు వేయబడినవి. ఆ కమిటీలలో గ్రంధకర్తలు సభ్యులుగా వుంటారు.

పై కమిటీల కార్యకలాపాలను సమన్వయపరచడానికీ, హైద్రాబాదులోని ప్రభుత్వ ముద్రణాలయం ద్వారా అచ్చువేసే దశవరకూ పాఠ్యపుస్తకాల తయారీ పనిని నిర్వహించడానికీ గెజిటెడ్ హోదాగల ఒక ప్రత్యేకాధికారి నియమించబడినాడు. ఆయన 1957 అక్టోబరు నెల మధ్యభాగంలో చార్జీపుచ్చుకొని పని ఉపక్రమించారు.





పుణ్యక్షేత్రాలు :

# అహోబిలం

అహోబిలం కర్నూలు జిల్లా సిర్వేల్ తాలూకాలో దుర్గమమైనకొండ ప్రదేశంలో వున్నది. ఇది విష్ణుమూర్తి నాలుగవ అవతారమైన నరసింహస్వామి ఆలయం అక్కడికి చేరడానికి ఎన్నో కష్టనిష్టురాలను సహించవలసి వున్నది. అయినప్పటికీ దాని ప్రసిద్ధిమాత్రము తగ్గలేదు. బాలభక్తుడైన ప్రహ్లాదుని రక్షణార్థము విష్ణుమూర్తి యిక్కడ స్తంభంనుంచి ప్రత్యక్షమై ముల్లోకాలను జయించిన రాక్షసుడు హిరణ్యకశిపుని సంహరించాడని పురాణ గాధ. నరసింహస్వామి పేరిట గల 32 పుణ్యతీర్థాలలోను యిది ప్రముఖమైనది. ఇక్కడ నవనరసింహు లని ప్రసిద్ధికెక్కిన తొమ్మిదిమంది నరసింహస్వాము లున్నారు.

ఈ ప్రదేశం పుణ్యస్థలాల్లో ఒకటిగా పురాణాలలో పేర్కొనబడింది. కర్నూలు జిల్లానుంచి చిత్తూరు జిల్లావరకూ వ్యాపించివున్న నల్లమల కొండల శ్రేణిని, పడుకుని వున్న పెద్ద తాచుపాము (శేషుడు) తో పోలుస్తున్న పురాణాలలోని ఒకానొక ఘట్టాన్ని గురించి డా. కృష్ణస్వామి అయ్యంగారు తమ తిరుపతి చరిత్ర (మొదటి సంపుటం - 35 పేజీ) లో పేర్కొన్నారు. శ్రీశైల మల్లికార్జున స్వామి ఆలయంతోక; అహోబిలం విష్ణుదేవాలయాలు నడుము; తిరుపతిపడగ(యేడుకొండలుయేడుతలలు); కాళహస్తీశ్వరుని దేవాలయం నోటిదగ్గిర వుంది. తరువాతి కాలంలో యీ ప్రదేశం దక్షిణాది ఆళ్వారుల ప్రశంసకు పాత్రమైంది. వారు దాని పవిత్రతకు ప్రత్యేక ప్రాముఖ్యాన్నిచ్చి, కొండలు, లోయలు, వృక్షజాతి, జంతుజాలాలతో కూడిన దాని సహజ సౌందర్యాన్ని కీర్తించారు. ఈ ప్రదేశానికి పంచక్రోశతీర్థము అనే మరొక పేరుకూడా వున్నది. దీనికి కారణం యిక్కడి నరసింహస్వామి 9 దేవాలయాలు 5 క్రోసుల (10 మైళ్లు) లోపు దూరంలో నిర్మించబడి వున్నాయి.

## మార్గము

అహోబిలానికి మూడు త్రోవలున్నాయి. ఉత్తరాన్నుంచి వచ్చే యాత్రికులు నంద్యాలలో రైలుదిగి, అక్కడినుంచి యించుమించు 25 మైళ్ళదూరంలో వున్న ఆళ్లగడ్డకి బస్సులోకాని జీపులోకాని వెళ్ళాలి. అక్కడనుంచి మళ్ళా 10 మైళ్ళలో వున్న అహోబిలానికి వెళ్ళాలి. బంగనపల్లి, కోయిలకుంట్ల, ఆళ్లగడ్డల మీదుగా వెళ్ళే మరొక రైలు స్టేషను డోన్‌నుంచి కూడా అహోబిలం వెళ్ళవచ్చును. మూడవ త్రోవ దక్షిణాన వున్నది. యాత్రికులు కడప స్టేషన్‌లో రైలుదిగి, అక్కడనుంచి 40 మైళ్ళ దూరాన వున్న చాగలమర్రికి బస్సులోవెళ్ళి అక్కడినుంచి జీపులో కాని బండిలో కాని 10 మైళ్ళలో వున్న అహోబిలానికి వెళ్ళాలి. నంద్యాల ఆళ్ళగడ్డ మార్గం దుర్గమమైనది. అయినప్పటికీ చాలమంది యాత్రికులు ఆత్రోవనే వెడతారు.

## ఆలయాలు

కొండల మొదట నున్న ప్రహ్లాద వరదుని ఆలయం యాత్రికులకు మొట్టమొదట కనబడుతుంది. ఇది మూడు ప్రాకారాలమధ్యన వుంది. విశాలమైన యీ దేవాలయం విజయనగరం శిల్పపద్ధతిలో నిర్మించబడింది. బహుశా రథోత్సవానికి కాబోలు రాళ్ళతో నిర్మించిన వీధి ఒకటి వుంది. కాని యిప్పుడు రథంలేదు. ఈ దేవాలయానికి ఒక ఫర్లాంగు దూరంలో వున్న 'ఆళ్వారు-కోనేరు'లో చక్కని మంచినీరు లభిస్తుంది. ఈ దేవాలయానికి దక్షిణాన యించుమించు 1½ మైళ్ళదూరంలో ఛత్రవట నరసింహస్వామి వున్నారు. ఇక్కడ దేవుడిచుట్టూ ముళ్ళపొదలున్నాయి. విగ్రహం రావిచెట్టుక్రింద ప్రతిష్ఠించ బడింది.

కొండఎక్కి ఎగువ అహోబిలం చేరేసరికి మనకు మొట్టమొదట యేకరాతితో చెక్కిన స్తంభం కనబడుతుంది. ఆరుమైళ్ళ దూరం వున్న ఈ త్రోవకు అడ్డంగా యెగుడుదిగుడు కొండమార్గమొకటి వున్నది. దీని ప్రక్కనుంచి పెక్కుసెలయేళ్ళు క్రిందికి పారుతూ వుంటాయి. పెద్దపెద్దవృక్షాలు చల్లనినీడను ప్రసాదిస్తాయి. ఇరుప్రక్కల నరసింహస్వామి యితలదేవాలయాలున్నాయి. త్రోవలో వున్న రఘుపతిమండపం నుంచి మళ్ళీ రెండుమైళ్ళునడిస్తే కరంగి నరసింహస్వామి ఆలయం వస్తుంది. అక్కడ యోగానంద నరసింహస్వామి కూడా వున్నారు. ఇక్కడస్వామి యోగముద్ర ధరించడంవల్ల ఆయనకీ పేరు వచ్చింది. హిరణ్యకశిపుణ్ణి సంహరించినతరువాత నరసింహస్వామి ప్రహ్లాదుడికి యోగంనేర్పడానికై యోగాసనాలు వేసి చూపించాడని పురాణగాథ. ఇక్కడ బ్రహ్మ తపస్సుచేశాడనీ, అలాగే భరద్వాజ మహర్షి కూడా తన పాపపరిహారార్థం యిక్కడ తపస్సు చేశాడనీ చెబుతారు.

ఎగువ అహోబిలం సముద్రమట్టానికి 2,800 అడుగులయెత్తున వున్న పీఠభూమి. దాని రెండు శిఖరాలలో ఒకదానిపేరు వేదాద్రి, రెండవదానిపేరు గరుడాద్రి. ఈ రెండిటిమధ్య భవనాశని నది ప్రవహిస్తున్నది. ఇది రెండుగాచీలుతుంది. ఒకపాయ చివరికి దక్షిణంగా ప్రవహించి కుముద్వతిలో కలుస్తుంది. రెండవపాయ చివరికి ఈశాన్యంగా ప్రవహించి కృష్ణానదిలో కలుస్తుంది. ఇది పాపప్రక్షాళన చేస్తుంది కనుక దీనికి భవనాశని అని పేరువచ్చింది. కొంతదూరం ఈ నది అంతర్వాహినిగా ప్రవహిస్తుందిట. యాత్రికులు తొలుదొల్త ఉగ్రనరసింహస్వామినర్చిస్తారు. ఈస్వామి దేవాలయం కొండ దక్షిణపుభాగంలో తొలచబడింది. దీనిగోపురాలు ద్రావిడ నిర్మాణపద్ధతిలో వున్నాయి. ఇక్కడఒక పెద్దమండపంవుంది. ఈ దేవాలయం అలసిపోయిన యాత్రికులకు చక్కని విశ్రాంతికేంద్రంగా వుంటుంది. దక్షిణంవైపు దానికిసమీపంలోనేవున్న ఒకగుహలో గుహానరసింహస్వామిప్రతిష్ఠించబడ్డాడు. ఈ గుహాద్వారంలోనే ఒక స్తంభంవుంది. అది వుక్కుస్తంభం అని చెబుతారు. పురాణగాథప్రకారం యీ స్తంభంనుంచే నరసింహస్వామి శత్రుసంహారానికై బయటికివచ్చాడు. ఈ దేవాలయానికి యించుమించు 3 ఫర్లాంగుల దూరంలో క్రోధ నరసింహస్వామి ఆలయంవుంది. దానికి సమీపంలో 'వరాహకుండ' వుంది.

రెండుమైళ్ళఅవతల 'మలోల నరసింహస్వామి' వున్నాడు. ఇక్కడ స్వామి శాంతస్వరూపుడు. లక్ష్మీదేవితో సర్వదా ఆడుకుంటూవుంటాడు. కాకతీయ ప్రతాపరుద్రరాజు బంగారువుత్సవ విగ్రహాన్ని సమర్పించాడు. అహోబిలం మఠం జియ్యరు మఠంలో

యిష్టదైవంగా పూజించడానికి దానిని తీసుకొనివెళ్ళి పోయాడు. ఇక్కడ ఒక విశేషమేమంటే స్వామి కూచునివున్నారు. కుడికాలు క్రిందికి వేళ్లాడుతూ వుంది. దానికి పాదుక తొడిగివుంది. అందుచేత మఠాధిపతి విగ్రహాన్ని యెక్కడికి తీసుకువెడితే అక్కడికి వెళ్ళడానికి స్వామి సంసిద్ధులైవున్నారనే ప్రతీతి వచ్చింది.

ఇంకాపైన జ్వాలా నరసింహస్వామి దేవాలయం వుంది. స్వామి రాక్షసుణ్ణి పట్టుకున్న స్థలంయిదే. ఇంకాపైన 'పవన నరసింహస్వామి' వున్నాడు. సామాన్య ప్రజానీకం యీయనను 'పాములేటి నరసింహు' డంటారు. పిల్లలకి 'పాములేటి' అని యీ దేవుని పేరు పెడతారు. అలాగే 'ఓబులయ్య' లేక 'ఓబయ్య' పేరుకూడా. ఇది అహోబిలానికి భ్రష్టరూపము. పవన నరసింహుడు శాక్తేయ విధానంలో పూజింపబడుతాడట.

ఈ ప్రదేశానికి చుట్టుపట్ల చాలా తీర్థాలున్నాయి. అయితే వీటిలో మిక్కిలి ముఖ్యమైనది 'రక్తకుండం' దీనినీరు యెరుపుచాయగా వుంటుంది. హిరణ్యాకశిపుని చంపినతరువాత స్వామిచేతులు దానిలో కడుక్కున్నాడనీ, అందుకే ఆనీరు అలా వుంటుందనీ చెబుతారు.

ఎగువ అహోబిలంలో దేవుడు స్వయంభువు అని చెబుతారు. స్వామి ఒక్కరూ యేవిధమైన ఆయుధాలు వుపయోగించకుండా ఆసురశక్తులను నిర్మూలించిన లోకోత్తరమైన మహాబలాన్ని, స్వామి వుగ్రస్వరూపాన్ని చూచి దేవతలు 'నరసింహ పరమ దైవం, అహోబలం, అహోబలం' అని ఆయనను స్తుతించారట. అందుచేత ఆ ప్రదేశానికి అహోబలం అని పేరు వచ్చిందట. ఉక్కుస్తంభం (ఇక్కడ గరుడుడు స్వామినిపూజించి, సాక్షాత్కారం పొందాడు) పక్కనవున్న పెద్దగుహ (బిలం) ను బట్టి దీనికి అహోబిలమనే పేరు వచ్చిందని మరొక వాదమున్నది. గుహలో వున్నందున యిక్కడ స్వామికి గుహ నరసింహుడని పేరు వచ్చింది.

ఈ దైవం ప్రేమగాథ తెలుగుప్రజల హృదయంలో నాటుకొని పోయింది. చెంచులక్ష్మి నరసింహుల ప్రేమపై యెన్నో జానపద గేయాలు రచించబడినవి. అక్కడనేవుండి సామాన్య ప్రజానీకాన్ని వుద్ధరించదలచిన స్వామి వైకుంఠానికి వెళ్ళడానికి నిరాకరించాడనీ, అందువల్ల లక్ష్మీదేవే చెంచుకులంలో పుట్టిందనీకూడా చెబుతారు. మామూలుగా ప్రతియేటా శివరాత్రి వెళ్ళినతరువాత 15 రోజులు స్వామి బ్రహ్మోత్సవాలు జరుగుతాయి. అప్పుడు జరిగే కార్యక్రమం చూస్తే ప్రజలకి యీ దైవంపట్లగల ప్రేమ వెల్లడవుతుంది. దేవి తమ కులంలో పుట్టినదనీ, కాబట్టి కల్యాణోత్సవం తాము జరిపించాలనీ పద్మసాలీలు చెబుతారు. స్వామి కల్యాణోత్సవంలో పెళ్ళిపెద్దలు తమాషాగా సంప్రదింపులు జరుపుతారు. దేవీదేవుల వుత్సవవిగ్రహాలు కల్యాణ మండపంలోనికి తీసుకొని రాబడినతరువాత వధువు తరఫున పద్మసాలీ కులం ప్రతినిధులు, వరుని తరఫున పురోహితులు సంప్రదింపులు జరుపుతారు. ఇందు నిమిత్తం పద్మసాలీలు ఒక సంఘంగా ఏర్పడ్డారు. వారిలో కల్యాణం యెవరు జరపాలో నిర్ణయించడానికై లాటరీవేస్తారు. కల్యాణం జరిపే అవకాశం వచ్చినవ్యక్తి ఆ సంవత్సరానికి మిక్కిలి అదృష్టవంతుడని భావించబడుతుంది.

## మఠాలు

ఈ ప్రదేశంలో మతసంబంధమైన కార్యక్రమాలు కూడా బాగా జరుగుతాయి. అహోబలం మఠం కార్యస్థానం యిక్కడవున్నది. అది 15 వ శతాబ్దంలో యేర్పడిందట. ఈ మఠం మొదటి జియ్యరు క్రీ. శ. 1379 లో శ్రీ కేశవాచార్య అనే శ్రీవైష్ణవునికి జన్మించారుట. కేశవాచార్యుని స్వస్థలం రేల్ కాట్ దేవగిరికి సమీపంలో వున్న తిరునారాయణపురమట. స్వామి బాలుడైన శ్రీనివాసాచార్యునికి కలలో కనిపించాడుట. స్వామి చెప్పినప్రకారం అతడు అహోబలం వెళ్లాడు. అక్కడ అతనికి అప్పటి ముఖ్యాధికారి ముకుందరాయుడు ఆతిథ్యమిచ్చాడు. స్వామి యోగివేషంలోవచ్చి అతనికివుపదేశమిచ్చారు. ఆవిధంగా మొదటి జియ్యరు యేర్పడ్డాడు. అతని పేరు శఠకోపయతి.

ప్రస్తుతపు జియ్యరు 43 వ వాడు. చాలరోజులు యీ మఠం ముఖ్యకార్యాలయం అహోబలంలో వుంది. తరువాత క్రమేణా అది ప్రస్తుతపు ప్రదేశానికి తరలించబడింది. ఈ మఠాధిపతులు యెన్నో మంచి

పుస్తకాలుకూడా ప్రచురించారు. శ్రీ వేంకటేశ్వ రునిపై పాటలతో తెలుగు భాషను సుసంపన్నం చేసిన సంగీత విద్వాంసుడు తాళ్ళపాక అన్నమా చార్యుడుకూడా ఈ మఠం మొదటి జియ్యరువల్ల వుపదేశం పొందారు.

ఈ ప్రదేశానికి చరిత్రాత్మకంగా కూడా ప్రాముఖ్య మున్నది. బొంబాయి రాష్ట్రంలో కల్యాణీ రాజధానిగా పరిపాలన చేసిన పశ్చిమ చాళుక్యరాజు (1076-1106) విక్రమకేతు కాలం నుంచీ కూడా మూలవిగ్రహాలు పూజింపబడుతు న్నాయి. ఆ తరువాత మహాబలవంతుడైన కాకతీయ వీరశైవరాజు (1300-1325) కాకతి ప్రతాప రుద్రదేవుడు శ్రీశైలంనుంచి తిరిగి వచ్చేటప్పుడు అహోబిలానికి 10 మైళ్ళ దూరంలో వున్న ఒక ప్రదేశంలో విడిదిచేశాడు. ఆ ప్రదేశానికి తరువాత రుద్రవరం అని పేరువచ్చింది. ఈరాజు పూజించడానికి ప్రతిరోజూ ఒక బంగారు శివలింగం తయారు చేయబడే దనీ, అయితే విచిత్రంగా అది చేయబోయిన ప్రతిసారీ నరసింహస్వామి విగ్రహమే తయారయేదనీ ఒక గాథ వున్నది. ఇందువల్ల చక్రవర్తి చాలా కలవరపడి పాపపరిహారార్థం వుపవాసవ్రతం ప్రారంభించాడు. స్వామి ఆయనకు కలలో కనపడి శివకేశవులు వేరనే దృక్పథం వ్యర్థమైనదని బోధించి, యెగువఅహో బిలానికి వెళ్ళి అక్కడ స్వామిని సేవించమని చెప్పాడు. తత్ఫలితంగా ప్రతాపరుద్రదేవుడు అక్కడి 9 దేవాలయాల్ని దర్శించి, చాలా కానుకలను ముఖ్యంగా వుత్సవ విగ్రహాలను యిచ్చాడట. విజయ నగర రాజులలో సుప్రసిద్ధుడైన శ్రీకృష్ణదేవరాయలు కళింగదేశాన్ని జయించి తిరిగివచ్చేటప్పుడు యీ దేవాలయాన్ని సందర్శించి జయచిహ్నంగా అక్కడ విజయస్తంభాన్ని నిర్మించాడనీ, స్వామికి ఒక వజ్రాలహారాన్ని, బంగారుపళ్ళెరాన్ని, వెయ్యి బంగారు నాణెములను యిచ్చాడనీకూడా ప్రాచీన కాలపు కవితలవల్ల తెలుస్తున్నది. కొండల మొదటనున్న రంగమండపంమీద యీనాటికీ అరు దైన శిల్పవిన్నాణం గోచరిస్తుంది.



# ఈయేడాది

## వార్తాచిత్రాలు



మున్కోటి ఆంధ్రుల చిరకాల వాంఛితం ఈడేరిన శుభవేళ. చారిత్రక ప్రాముఖ్యం గల ఫతేమైదాన్‌లో ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి లాంఛనప్రాయంగా ప్రారంభోత్సవం జరిపారు.



ఆంధ్ర ప్రదేశ్ తొలి ముఖ్యమంత్రిగా 1956 నవంబరు 1 వ తేదీన శ్రీ నీలం సంజీవరెడ్డి ప్రమాణస్వీకారం చేస్తున్న దృశ్యం.

30-11-1956-తేదీన ఆంధ్ర ప్రదేశ్ మంత్రిగా శ్రీ బెజవాడ గోపాలరెడ్డి రాజ్ భవన్‌లో ప్రమాణస్వీకారం చేశారు.

విజయవాడ రేడియో కేంద్రానికి కొత్త ట్రాన్స్మిటర్ - ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి 20 కిలోవాట్ల ఈ మీడియం వేవ్ ట్రాన్స్మిటర్‌కు ప్రారంభోత్సవం చేశారు.



భారత ప్రభుత్వ సామాజికాభివృద్ధి శాఖ మంత్రి శ్రీ యస్. కె. డే. 9-1-1957 తేదీన షాద్‌నగర్ తాలూకాలో బాలానగర్ గ్రామ మందిరానికి ప్రారంభోత్సవం చేశారు.



హైదరాబాదులో అఖిలభారత పారిశ్రామిక ప్రదర్శనంలో సమాచార పౌరసంబంధముల శాఖ స్టాలు.



విజయవాడ వద్ద కృష్ణా బ్యారేజీ నిర్మాణాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి తనిఖీ చేశారు.

1-2-1957 తేదీన ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి తుంగభద్రపై వంతెనకు శంకుస్థాపన చేశారు. ఈ వంతెన బెనారెస్ - కన్యాకుమారిఅగ్రం జాతీయ రహదారిపై నిర్మింపబడుతున్నది.



1957 జనవరి 26 రిపబ్లిక్ దినోత్సవంనాడు ఫతేమైదాన్‌లో జరిగిన బాలల విన్యాస ప్రదర్శనం.



**14-2-1957** తేదీన భారత ప్రభుత్వ ఆర్థిక విచారణ సంఘంవారు "లేక్ వ్యూ" ప్రభుత్వ అతిథి గృహంలో పత్రికా విలేఖరులతో గోష్ఠి జరిపారు.



రాష్ట్ర శాసనసభలో **1957** మార్చి **20** తేదీన అప్పటి ఆర్థిక మంత్రి శ్రీ కళా వెంకటరావు తాత్కాలిక బడ్జెటు ప్రవేశపెట్టారు.

లోక్‌సభ కార్యదర్శి శ్రీ యం. యస్. కౌల్ రాష్ట్ర శాసన సభల కార్యదర్శులతో చర్చలు జరుపుతున్న దృశ్యం.



ఈ యేడాది దుస్సంఘటనలలో భద్రాచలం పడవ ప్రమాదం ఒకటి. గోదావరి నీటిలో మునిగిపోయిన రెండు పడవలలో ఇదొకటి.

27-3-1957 తేదీన హైద్రాబాదులోని కేన్సర్ ఆసుపత్రిలో జరిగిన ఒక సభలో పార్లమెంటు సభ్యుడు
శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి ఆ ఆసుపత్రికి తాము రూ. 25,000 విరాళం ఇస్తున్నట్లు ప్రకటించారు.



రాష్ట్ర రాజధాని నగరంలో ఆంధ్ర ప్రజా నాయకులు శ్రీ ప్రకాశం పంతులుగారు జీవయాత్ర చాలించారు.
"గాంధీ భవన్" లో శ్రీ ప్రకాశంగారి భౌతిక దేహంవద్ద వారి కుటుంబం.



ఈ యేడు జరిగిన చర్చాగోష్ఠులలో ఆంధ్ర ప్రదేశ్ అభివృద్ధి కార్యక్రమాల విద్వద్గోష్ఠి ప్రత్యేకంగా చెప్పదగింది.
గోష్ఠిలో యూనియన్ ప్రభుత్వ సామాజికాభివృద్ధి శాఖ మంత్రి శ్రీ యస్. కె. దే ప్రసంగించారు.

**9-6-1957** తేదీన లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా వారి జనతా భీమా పాలసీల పథకానికి



*10-6-1957* తేదీన మహబూబ్‌నగర్ జిల్లా కొండుర్గు జాతీయ విస్తరణ సేవా కేంద్రం ప్రారంభోత్సవం జరిగింది. రాష్ట్ర ప్లానింగు మంత్రి ప్రారంభోత్సవ సభలో ప్రసంగిస్తున్న దృశ్యం.



ప్లానింగు మంత్రి శ్రీ వి. బి. రాజు **25-6-1957** తేదీన నల్లగొండ జిల్లా యంద్లపల్లి జాతీయ విస్తరణ సేవాకేంద్రానికి [illegible] తీసుకెడుతున్నారు.



ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 23-9-1957 తేదీన "శ్రేయోరాజ్యంలో విశ్వవిద్యాలయాల పాత్ర" అను విషయంపై విద్యార్థుల జాతీయగోష్ఠి జరిగింది. ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ గోష్ఠిని ప్రారంభించారు.



మూసీ ప్రాజెక్టు కుడిప్రక్క కాలువగుండా ఈ యేడు పొలాలకు నీరు వదలబడింది.



యూనియన్ ప్రభుత్వ దేశీయ వ్యవహారాల శాఖ మంత్రి పండిత గోవింద వల్లభ పంత్ 29-9-1957 తేదీన హైదర్‌షా కోటలోని కస్తూర్బా గ్రామసేవికల శిక్షణ విద్యాలయాన్ని సందర్శించిన సందర్భంలో అక్కడ ఒక మొక్క నాటారు. ఇది హైద్రాబాదు సమీపంలో వుంది.



హిందీ భాషా వ్యాప్తికి శ్రీ మోటూరి సత్యనారాయణగారు చేసిన సేవకు ప్రశంసాసూచకంగా హైదరాబాదు నగరంలో వారికి సన్మాన సంచిక సమర్పించబడింది.

ఈ యేడు రాష్ట్రపతి హైద్రాబాదు నగరం విచ్చేసినప్పుడు సికింద్రాబాదు స్టేషన్‌లో వారికి ఘనంగా స్వాగతమివ్వబడింది.

రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ నాగార్జునకొండ త్రవ్వకాలలో బయల్పడిన పురావస్తు విశేషాలను చూచారు.



రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి కొత్తగూడెం బొగ్గు గనిని చూచి
అచటి సంగతి సందర్భాలు తెలుసుకొన్నారు.



రష్యాదేశానికి మనం పాదరక్షలు ఎగుమతి చేస్తున్నాము. అట్టి ఎగుమతికొరకై హైదరాబాదులో తయారుచేయబడిన జోళ్ళ నమూనాలివి.

ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర నూతన గవర్నర్‌గా నియమింపబడ్డ శ్రీ భీమసేన్ సాచార్ 1957 ఆగస్టు 1 వ తేదీన పదవీ స్వీకారం చేశారు. ఆంధ్ర ప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ కె. సుబ్బారావుగారు వారిచేత ప్రమాణస్వీకారం చేయిస్తున్న దృశ్యం.



ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తొలి యేడాదిలోనే 1857 స్వాతంత్ర్య సమర శతవార్షికోత్సవంకూడా జరగడం ఒక విశేషం. ఆ సమరంలో పాల్గొన్న వీరుల స్మారకార్థమై హైద్రాబాదునగరంలో రెసిడెన్సీవద్ద స్మారక చిహ్నం నిర్మింపబడింది. దీన్ని 1957 ఆగష్టు 17 వ తేదీన రాష్ట్రగవర్నర్ శ్రీ భీమసేన్ సాచార్ అమరవీరులకు అంకితం చేశారు.



యూనియన్ ప్రభుత్వ దేశీయ వ్యవహారాల శాఖ మంత్రి పండిత గోవింద వల్లభ పంత్ 28-11-1957 తేదీన సికింద్రాబాదు దగ్గరవున్న అమ్ముగూడా జై జవహర్ నగర్ కాలనీ సందర్శించారు.



అమ్ముగూడా జై జవహర్ నగర్ కాలనీ దృశ్యం.



యూనియన్ ప్రభుత్వ దేశీయ వ్యవహారాల శాఖ మంత్రి పండిత గోవింద వల్లభ పంత్ 29-9-1957 తేదీన హైదరాబాదు నగరంలో దక్షిణాది రాష్ట్రాల నాన్‌గెజిటెడ్ ఉద్యోగుల ఫెడరేషన్ మహాసభకు ప్రారంభోత్సవం జరిపారు.





అగ్నిప్రమాదముల నిరోధక వారం సందర్భంలో 1957 అక్టోబరు 17వ తేదీన
హైద్రాబాదులోని వాటర్ వర్క్స్ డివిజన్ కార్యాలయంలో అగ్ని మాపక ప్రదర్శనం జరుపబడింది.



1957 అక్టోబరు 24వ తేదీన ప్రపంచ మంతటా ఐక్యరాజ్యసమితి దినోత్సవం జరుపబడింది. హైద్రాబాదులోని స్టాన్లీ బాలికల ఉన్నత పాఠశాల హాలులో రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి సమితి దినోత్సవ సభను ప్రారంభించారు.




పిల్లలు వేషధారణతో ఐక్య రాజ్యసమితి తాలూకు వివిధ సంస్థలను చూపెట్టారు.



ఐక్యరాజ్యసమితి దినోత్సవం సందర్భంలో సికింద్రాబాదులోని వెల్లస్లీ ఉన్నతపాఠశాలలో
బాలల విన్యాసప్రదర్శనం జరిగింది. ఆ ప్రదర్శనంలో బహుమతి పొందిన బాలను రాష్ట్ర విద్యామంత్రి అభినందిస్తున్నాడు.

1957 అక్టోబరు 19 తేదీన షంషాబాదులో నిర్వహింపబడిన గ్రామనాయకుల శిక్షణ శిబిరంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ప్రసంగిస్తున్న దృశ్యం



కర్నూలులోని పొట్టి శ్రీరాములు భవనం- ఇప్పుడీభవనంలో వైద్యకళాశాల నెలకొల్పబడింది.



సనత్ నగర్ పారిశ్రామిక ఎస్టేటు శంకుస్థాపన ఉత్సవ సందర్భంలో ప్రసంగిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి

# ఆంధ్రప్రదేశ్ ప్రకటన రేట్లు

'ఆంధ్ర ప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ | పూర్తి పేజీ రూ | సగం పేజీ రూ | పావు పేజీ రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరంకొరకు స్థలమును కంట్రాక్టుతీసుకొన్న వారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు : 10¾" × 8½ డెమీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరుద్వారా గాని, లేక క్రాస్ చేయబడని డిమాండు డ్రాఫ్టుద్వారా గాని పంపవలెను. డిమాండుడ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు- దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్తవహింపబడుతుంది. అయితే మిషనుమీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏ వైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడుభాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్ :
సమాచార పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాదు దక్కన్ — 1.

# దేశంతోపాటు మీరుకూడా
# అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును
## భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో
## పెట్టుబడి పెట్టండి!

*భారత దేశం యొక్క*

సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,

రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| *12 సంవత్సరముల ట్రెజరీ ప్లాన్ సేవింగ్స్ సర్టిఫికెట్లు* | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి కూడా లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| *10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ఏడాదికి నూటికి 4 వంతులు చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఒకొక్కరు రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి కూడాలభిస్తాయి. |
| *పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు* | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2½ వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. |

### 15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు : రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000రూ. 28,000 వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 28,000ల వరకు కొనవచ్చును. | నూటికి ఏడాదికి 3½ వంతుల చక్రవడ్డీతో నెలసరి వాయిదాలుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతవి. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*
## *భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు :

**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకుగాని లేక**

**రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)**

చిరునామాకు గాని వ్రాయవలెను.

గవర్నర్ సతి శ్రీమతి లలితా సాచార్ బ్లడ్ బ్యాంకుకు రక్తదానం చేశారు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి డెవలప్‌మెంటు కమీషనర్ శ్రీ యం. వి. పాయ్
19-10-1957 తేదీన హైద్రాబాదుజిల్లా షంషాబాదులో గ్రామీణ కళల,
చేతిపరిశ్రమల కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపారు



